# గోరంత దీపాలు

(...వితాన్ని ఫలవంతం చెయ్యగల కొన్ని ఆలోచనల సంపుటి)

దివ్యాత్ములైన

**శ్రీ శారదా రామకృష్ణుల**

పాదపద్మాలకు

ప్రచురణ : జనవరి '84

హక్కులు : రచయితవి

వెల : రు. 6

ముద్రణ : మాతృశ్రీ అనసూయ ప్రెస్, నెల్లూరు

ముఖపత్రం: దాశరథి

ప్రతులకు : శ్రీ యస్. వి. నరసింహారావు, బి. ఏ. బి. టి.,
శ్రీరామకృష్ణ సేవానమితి 16/1083 పొగతోట, నెల్లూరు 1

శ్రీ ఐ. నాగమల్లారెడ్డి, కాపువీధి, నెల్లూరు - 1

శ్రీ రామా స్టూడెంట్స్ ఎంపోరియం, నెల్లూరు-1

# క్రమదర్శిని

# పుస్తక పరిచయం

ఇందులోని వ్యాసాలు ఒక్కొక్కటీ 1972-73 సం॥లో వారం వారం ధారావాహినిగా నెల్లూరునుంచి వెలువడుతూ వుండిన 'యూత్ కాంగ్రెస్'లో గోరంతదీపం శీర్షికక్రింద ప్రచురించబడ్డవే. స్థానిక వారపత్రిక లోని ఒక ఫీచర్‌కుండే పరిమితులు వీటికీ వున్నాయి. సమాజంలో, ముఖ్యంగా నేటి యువతరంలో, ఎంతో కొంత ఎదుగుదల, మెరుగుదల సాధించాలనే తహతహ, అది సాధ్యమేనన్న ఎదురుచూపూవున్న మనిషిగా, నా ధోరణిలో నేను పాఠకులను పలకరించాను. ప్రతిస్పందన కన్పించింది ముఖ్యంగా చదివినవాళ్ళు చదువదగ్గ విషయాలివి అన్నారు

ఇందులోని విషయాలు సర్వజనీనమైనవీ, సర్వకాలీన మైనవీ అవునేమో అన్న భావన లేక భ్రాంతి నాకుంది కాబట్టే యీ ఆలోచనలకు పుస్తకరూపం కల్గించేందుకు సాహసిస్తున్నాను.

ఆ రోజుల్లో నన్ను ప్రోత్సహించిన సహృదయులెందరో వున్నానాకు ఎప్పటికీ గుర్తుండేవారిలో కార్మిక నాయకుడూ యూత్ కాంగ్రెస్‌పత్రికాధిపతీ శ్రీఎల్ వి. కృష్ణారెడ్డిగారున్నూ, సామ్యవాద మేధావీ, వి. ఆర్. కాలేజి ఆచార్యుడూ, నా కాప్తమిత్రుడూ శ్రీ ఎం. పట్టాభిరామిరెడ్డిగారున్నూ తొలుత పేర్కొనదగిన వారు. అప్పుడు సంపాదకుడుగానున్న శ్రీ తుంగా రాజగోపాలరెడ్డిగారు మొదట మొదట నాకెంతో ప్రోత్సాహాన్నందచేశారు.

శస్త్రవైద్యులుగానూ,సంఘసేవాపరాయణులుగానూజిల్లాలో ప్రఖ్యాతిగాంచిన డా॥సి.పి శాస్త్రిగారు నాకత్యంతాప్తులు-వారి నిరంతర ప్రోత్సాహానికి కృతజ్ఞుడను.

వైయక్తికజీవితంలోవలెనే నాసాహిత్య వ్యాసంగానికిగూడా నా శ్రీమతి విజయలక్ష్మి ప్రోత్సహ సహకారాలు నాకున్నాయి.

ఈ పుస్తకం ఒక చిరుదివ్వె వంటిది. ఎంతోకొంత వెలుగును పంచిపెట్టగలదని విశ్వసిస్తున్నాను. ముందుకు సాగండి.

— మీ శారదాకుమార్

# మతమూ - గీతమూ - యింగితమూ

మా పక్కింటి ప్రకాశం తమాషా మనిషి. ఒక రోజు పొద్దున్నే దేవుడింట్లో కూర్చుని అతడు చేస్తున్న వింత ప్రార్థన ఒకటి నాకు వినిపించింది. అతడు ఏమని ప్రార్థిస్తున్నాడో మీకూ చెప్పాలనుకున్నాను. 'ఓ భగవంతుడా. నన్ను మిథ్యలోనుంచి సత్యంలోకి నడిపించు; చీకటిలో నుంచి వెల్తురులోకి నడిపించు; చావులోనుంచి అమరత్వంలోకి నడిపించు; ముఖ్యంగా గీతంలో నుంచి మతంలోకి నడిపించు' అంటున్నాడు.

అతని ప్రార్థన ఎంతో పాతదిగానూ ఎంతో కొంత కొత్తది గానూ నాకు వినిపించింది. తర్వాత నాకు జ్ఞప్తికి వచ్చింది, చరిత్ర కందని కాలంలో, ఎవరో చిరునామా తెలియని వేదఋషి,

"అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా మృతంగమయ"

అంటూ ప్రార్థించి వున్నాడని. మా పక్కవాటాలోనుంచి నేవిన్న ప్రార్థనలోని మొదటి మూడు 'నడిపించు'మన్న చరణాలూ అచ్చంగా ఆ వేదఋషి శ్లోకంలోని మూడు పాదాలకూ చక్కగా సరిపోతాయి.

ఋషిగారికేక బహుశః నాలుగయిదువేల యేళ్ళ కాలాన్నం తటినీ దాటుకుంటూవచ్చి సగటు సాధకుడయిన మా ప్రకాశం ప్రార్థనలోనూ ప్రతిధ్వనించింది. ఓహో, యెట్లయినా మన రక్త నాళాల్లోనూ ఋషుల తాలూకు నెత్తురే ప్రవహిస్తున్నది. కాబట్టి మన బుల్లిగుండెలు సైతం వాళ్ళ వేద ఘోషకు శ్రుతిగలుపు తున్నాయి లెమ్మని సంబరపడ్డాను. కాని యింతలోనే తన సొంత గొంతులోంచి నిస్పృహగా వెలువడ్డ 'గితంలోనుంచి మతంలోకి నన్ను నడిపించు'' మన్నమాటలు గుర్తొచ్చి నా ఆలోచనలకు రెక్కలు తొడిగాయి.

నాకు తెలియకుండా నేనూ, మీకు తెలియకుండానే మీరూ యీ ప్రార్థన చేస్తూనే వున్నాం. ''గితంలోనుంచి మతంలోకి నడి పించు, భగవాన్,'' యిదీ మన ఆక్రందనం.

మన చుట్టూరావున్న మతం తాలూకూ విలువలు మనకు అస్తవ్యస్తంగా, నిజానికి తలక్రిందులుగా వున్నట్లు కన్పిస్తాయి. ఎవరో కవి అన్నట్లు అలవాటయి అస్వస్థతే ఆరోగ్యమైపోయింది! ఉదాహరణకు పెంటపాడునుంచి వైష్ణవ పత్రిక అని ఒక మాస పత్రిక వస్తుంది. అందులో ఒకసారి ఒక పెద్ద చర్చ! అదియే మంటే విధవరాళ్ళు-అంటే తలచెడిన బ్రాహ్మణ స్త్రీలు-ధనుర్మా సంలో శిరఃస్నానం చేయవలెనా? లేక కంఠస్నానముతో సరిపెట్టు కోవచ్చునా? గొంతువరకు చాలునని కొందరూ, గుండుపైకికూడా

అవి కొందరూ! ఇదీ ఆ మహామేధావులకు కొరుకుడు పడని అంతర్జాతీయ సమస్య! ఆ తలచెడిన మహాతల్లుల గూర్చి యీ మహాపండితులు చేసే చర్చవల్ల పీళ్ళకూ ఎంతగా తల చెడిందో నాకు తెలిసివచ్చింది. ఇదేనా మతం యొక్క పరమార్థం?

ఈ అఘాయిత్యం అంతా చూచి వొళ్లు మండిపోయింది కాబోలు పాపం వివేకానందస్వాముల వారికి. 'ఒక రకం సాధువులూ, సన్యాసులూ, బ్రాహ్మణులూ చేరి యీ దేశాన్ని నాశనం చేశారు. ఎంతసేపటికీ దోపిడీమీదనే, దుర్మార్గంమీదనే కళ్ళుపెట్టుకున్న పీళ్లగొప్ప మతప్రచారకులవలె నటిస్తారు. ఒకవైపు ప్రజల నుంచి కానుకలూ, కట్నాలూ స్వీకరిస్తూనే 'దూరంగా వుండు. తాకుతావ్' అని వాళ్ళను కేకలు పెడ్తారు. ఇంకా వాళ్ళేం ఘనకార్యం సాధిస్తున్నా రనుకుంటున్నారు, యిన్నాళ్లూ' ఒక ఉర్లగడ్డ వంకాయను తాకితే ప్రపంచానికి జలప్రళయం వస్తుందట ఎప్పుడో! చేతులు కడుక్కునే టప్పుడు దజనుసార్లు మృత్తిక (మట్టి) రాసుకుని కడుక్కోకపోతే పధ్నాలుగు తరాల పూర్వీకులు నరకానికి పోతారా లేక ఇరవైనాలుగు తరాల వాళ్ళు నరకానికి పోతారా? యిలాటి తిరకాసు సమస్యలకు తీరిక చేసుకుని రెండువేల ఏళ్ళగా వాళ్లు శాస్త్రీయమైన వ్యాఖ్యానాలు చేస్తూకూర్చుంటే ప్రజల్లో నాల్గవంతు కటిక ఉపవాసాలతో మాడుతున్నారు.' అని వాళ్ళమీద విరుచుకపడ్డారు స్వామీజీ.

'భగవంతుని విశ్వరూపం అంటే యీ ప్రపంచమే. దాన్ని పూజించటం అంటే దానికి సేవచేయటమే. ఇదే నిజమైన కర్మ. అంతేగాని శుష్కమయిన కర్మకాండలో కొట్టుకలాడటం కాదు. నైవేద్యపు పళ్ళెరాన్ని దేవుడిముందు పది నిమిషాలపాటు వుంచాలా! లేక అరగంటసేపు వుంచాలా! అన్నవి చికిత్సకాదు సరియైన కర్మ. దీన్ని పిచ్చి అని మాత్రం పిలవొచ్చు.'

" The universal aspect of God means this world and worshipping it means serving it — this indeed is work, not indulging in ecremonials. Neither is it work to cogitate whether the rice plate should be placed in front of the god for ten minutes or for half an hour — that is called lunacy."

మరొకచోట స్వామీజీ, 'మీ మతం వంటపాత్రలో కూర్చుందండోయ్' Your religin has entered the cooking-pot అని కూడా హేళనచేశారు. ఆ మనీషి ఎంత చెబుతేయేం, ఎంతమొత్తుకుంటేయేం, యీ అపరబుద్ధులు-నిజానికి అసుర బుద్ధులు-పురోహితులూ-అర్చకులూ-మతాధిపతులూ-మఠాధిపతులూ కలిసి ఆయన్ని ఆయన మహత్తర ధ్యేయాన్ని కాసుకు కొరగాకుండా చేయగల్గారు. అందుకే ప్రపంచం కుక్కతోకలాటిది. దాన్నెవరూ సరిచేయలేరని నిరాశగా అన్నారు స్వామీజీ. ఆత్మవత్ సర్వభూతాని యితరులను తనవలెనే చూచుకొనవలయును అను ధర్మం పుస్తకాల్లోనే వుండిపోయింది. డాంబిక మతాచారాలు-కడగటం తోమటం

కాళ్ళమీద నీళ్ల చల్లుకోవటం-బుడకోళ్ళలా నీళ్ళలో మునగ టం మాత్రం శ్రద్ధగా ఆచరింపబడుతున్నాయి. ఎదుటివాడి గాలి సోకితేనే అపవిత్రులయిపోయేవీళ్ళు యితరులను ఎట్లా పవిత్రులుగా చేస్తారా అన్న సందేహమూ వచ్చింది ఆయనకు!

మతాన్ని భావదాస్యంకోసం వాడుకున్న పీఠాధిపతికాదు వివేకానందుడు మనిషికి భావస్వేచ్ఛను ప్రసాదించే సాధనంగా, జనతకు పారమార్థిక శ్రేయస్సుతోపాటుగా ఆర్థికాభ్యుదయాన్ని ప్రసాదించేదిగా జాతిని సజీవశక్తిగా నిలబెట్టే సాధనంగా మతాన్ని వారు గ్రహించారు. అందుకే ఆయన యీ దేశాన్ని మూలన కూర్చుని రుద్రాక్షలు తిప్పే విధవల మతం (Widow's religion) పాలు చేయటానికి అంగీకరించలేదు. 'ఏ మాత్రమైనా మనకు మేలు చేకూరాలంటే యీ కర్మకాండ నంతటినీ కట్టగట్టి విసరికొట్టి సజీవ దైవాన్ని – మానవదైవాన్ని – మనిషిరూపంలో వున్న ప్రతిజీవినీ సేవించమన్నారు ఆయన. If you want any good to come, just throw your ceremonials overboard and worship the living God, the man-god, every being that wears a human form.

మతంపేరులో చెలామణి అవుతున్న గితం రాక్షసికి అనేక ముఖాలు. మతం-గితం-రెంటి నిజస్వరూపాలనూ ఆకళింపు చేసుకోనిదే సగటు సాధకుడు–సామాజిక చైతన్యంగల మనిషి-అభ్యుదయ నిశ్రేయసాలను సాధించుకోలేడు. ఈ పుణ్యభూమిలో

పుట్టిన ఫలితం అనుభవించలేదు. గతంలోనుంచి మతంలోకి నడి పించమని ప్రార్థించే వారిలో మీరూ ఒకరైతే యింకా కొన్ని రహస్యాలు పబ్లిగ్గా మీకు చెబుతాను.

# మతమూ - గీతమూ - యింగితమూ - 2

పొద్దున లేస్తూనే పక్కింటి ప్రకాశం మా యింట్లో ప్రత్యక్ష మయ్యాడు, ఆంధ్రపత్రిక డెయిలీ ఒకటి చేతబుచ్చుకొని పేపరు ఎగాదిగాచూస్తూ, గురువుగారూ, సంపాదకీయానికి సరిగ్గా నెత్తిన్నే ఒకే పద్యం రోజూ కన్పిస్తుందీ దీన్ని మీరూ గమనించేవుంటారు. ఏమిటి దీనికి కారణం? అనీ క్వశ్చన్‌మార్కు పోజులో నిల్చున్నాడు గడపట్లో.

ఆ పద్యం మీలాగే నాకూ తెల్సిందే కాబట్టి,

"ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియంబు తనమనంబునకగుతా
నొరులకునవి చేయకునికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్''

అని గడగడా వొప్పచెప్పేశాను. 'దీని భావాన్నిబట్టి చూస్తే సంపాదకీయం ఎవరినీ నొప్పించకుండా వుండాలన్నది ఆ పత్రిక పాలసీవలె కన్పిస్తున్నది. ఇది మళ్ళీ మళ్ళీ సంపాదకుడికి గుర్తుండటానికే కాబోలు యీ పద్యాన్ని రోజూవేస్తున్నారు, అన్నాను. అక్కడికది సరిపోయింది.

ఈ పద్యం భారతంలోది. నాలుగు వేదాల తర్వాత మహా భారతానికున్న ప్రాముఖ్యత, ప్రామాణికత మరియే యితర హిందూమత గ్రంధానికీలేదు. అందుకే దాన్ని ఐదోవేదం అనీ అన్నారు పెద్దలు. ఎటొచ్చీ మన సమాజధర్మానికీ, సంస్కృతీ సంప్రదాయాలకూ ఆవుద్గ్రంథం మాతృస్థానంలోవుంది. పుస్తకం వాశిలోనూ, రాశిలోనూ పెద్దదే.

ఇంతకూ యీ పద్యంలో భావం ఏమంటే యితరులు ఏం చేస్తే మనమనస్సు కష్టపడుతుందో ఆ పనులు యితరులపట్ల మనం చేయకుండా వుండాలి అదే ధర్మ మార్గాల్లోకల్లా గొప్ప ధర్మం అని.

ఈ పద్యంలో భావానికి సంవదించే వెర్స్ ఒకటి బైబిల్లోనూ వుంది As ye would that men should do to you do ye also to them lika wise అన్నారు క్రీస్తు. అంటే మానవులు నీపట్ల ఎట్లా ప్రవర్తించాలని కోరుకుంటావో నీవూ వారిపట్ల అట్లా ప్రవర్తించు అని.

ఈ రెండు చోట్లా భావం వొకటే. ఐనా వ్యక్తీకరణలో మనం ముఖ్యంగా గమనించాల్సిన తేడా వొకటి వున్నది. హిందూ మత గ్రంథమైన భారతంలో నిషేధరూపంలోనూ, క్రైస్తవ మత గ్రంథమైన బైబిల్లో విధిరూపంలోనూ ఒకే సందేశం చెప్పబడింది. నిషేధం అంటే వద్దనిచెప్పటం. పై పద్యంలో ఏమని వున్నది?

ఫలానా విధంగా మనం ప్రవర్తించకుండా వుండాలి. ప్రవర్తించ కూడదు అని. మరి బైబిల్లోనో? ఫలానా విధంగా మనం ప్రవర్తించాలి అని వుంది.

ఈ తేడా యేదో ఒకచోట యాదృచ్ఛికంగా కన్పించేదికాదు. సర్వత్రా వున్నదే. హైందవ నీతి శాస్త్రం నిషేధాన్ని నొక్కి చెబుతుంటే క్రైస్తవం విధిని గట్టిగా చెబుతుంది. అయితే బైబిల్లోని ఓల్డ్ టెస్టమెంట్‌లోనూ నిషేధాజ్ఞలదే పెత్తనం!

నాకు బాగా గుర్తు. చిన్నప్పుడు నేను ఎలిమెంటరీ స్కూల్లో చదువుకుంటున్న రోజుల్లో మా బడిగోడలనిండా యీ నిషేధాజ్ఞలే వ్రాసిపెట్టివుండేవి. అబద్ధమాడరాదు– అవిధేయత పనికిరాదు- దొంగతనము చేయరాదు– ఈతకొట్టరాదు– యిట్లా ఎన్నో! ఇంక మన కాపీపుస్తకాలనిండా యీ నిషేధాజ్ఞలే యిప్పటికీ కన్పిస్తున్నాయి. మన యిళ్ళల్లో నాయనమ్మలూ అమ్మమ్మలూ మూర్తీభవించిన నిషేధాజ్ఞలవంటివారు. నామట్టుకు నేను సుప్రీంకోర్టునైనా ఎదిరించగలను కాని మా నాయనమ్మనుమాత్రం ఏనాటికీ ఎదిరించేవాణ్ణికాదు. ఎందుకు ఆమె వద్దంటుందో, కాదంటుందో, ఆమె చెప్పనూ చెప్పదు, మనం అడగనూ కూడదు! ఆమె "వద్దు"లకు హద్దుగాని, పద్దుగాని వుండేదికాదు. ఆమె అనంతమైన "వద్దు" ల తోరణంలా, రూపుగొన్న వృద్ధహైందవ మతంగా కన్పించేది పాపం నా కళ్ళకు!

ఈ వద్దుల పురాణం ఎంతోవుంది. హిందువులకు, మతగ్రంథాల నుంచి కాశీ మజిలీ కథలదాకా. ఏ రాజకుమారుడో అపాయాలను వెతుక్కుంటూ బయలుదేరడం, పేదరాశి పెద్దమ్మకొంప చేరటం. ఆవిడ 'అబ్బాయ్ చూడు, నీవు ఎక్కడికయినా వెళ్ళగాని వూరికి ఉత్తరానవుండే మర్రిచెట్టు తొఱ్ఱదగ్గరికి మాత్రం పోవద్దని చెప్పటం. అతడు పనీబడ వద్దని చెప్పబడ్డ ఆ తొఱ్ఱలోకే తొంగి చూడటం, ఆ తర్వాత కథా వుంటుంది. వద్దంటేచాలు మనిషిలో కుతూహలం పెరుగుతుంది. మీరూ గమనించే వుంటారు. Wet paint, dont touch అని వ్రాసిన బోర్డు వున్నా మనం మాత్రం చూపుడువేల్తో గోడనుతాకి కొంచెం రంగు అంటుకుంటే 'అబ్బే' అని చెయ్యి వెనక్కు తీసుకుంటాం. ఆవునా? ఎన్నో కష్టాలకోర్చి పాపం మన బడిపిల్లలు Adult certificate తెచ్చుకున్న చిత్రాల కెగబడటం మనకు తెలిసిందే అందుకే నేచెప్పేది వద్దు అనేమాట వాడవద్దు అని! నిషేధం అన్నదాన్ని నిషేధించాలి.

నేనేదో చెప్పబోయింది మాటల్లో పెట్టలేక చిక్కుల్లో పడ్డానని మీరనుకుంటున్నారు కదూ. యీ చిక్కు ఎవ్వరికీ తప్పలేదు బాబూ. వివేకానందస్వాములవారు పశ్చిమ దేశాలు చుట్టివచ్చిన తర్వాత క్రైస్తవ మతంలోని మంచిని యింకా ఎక్కువగా ఆకళింపు చేసుకున్నారు. ఆ తర్వాతే వారు కలకత్తా దగ్గరున్న బేలూరు మఠం స్థాపించారు, యిప్పటికి 83 యేళ్ళ క్రిందట. మరి

ఆ మఠంలోని సాధకులకూ, సాధువులకూ కొన్ని నిబంధనలు యేర్పరచాల్సి వచ్చింది స్వామీజీ. యీ వద్దు-కాదు-అన్న నిషేధాజ్ఞలంటే ఆయన నెత్తురు మసిలిపొయ్యేది. అన్ని నిబంధనలూ Positiveగా వుండాలికాని ఏదీ Negativeగా వుండరాదనేది ఆయన సంకల్పం!

ఆలస్యంగా నిద్ర లేవకూడదు అనకుండా పెందలకడనే నిద్ర మేల్కొనవలెను అనీ, స్నానము చేయనిదే ధ్యానమునకు కూర్చుండరాదు అనకుండా స్నానముచేసి ధ్యానమునకు కూర్చుండవలెను అనీ, వేళతప్పి భోజనం చేయవద్దు అనకుండా, వేళప్రకారం భోజనం చేయవలెననీ-యిలా నిబంధనలన్నిటినీ విధి రూపంలోనే పకడ్బందీగా వ్రాసుకొచ్చారు; స్వామీజీ. ఇలా వద్దు, కాదు రాదు, అన్నవాటిని వెలివేసి జాగ్రత్తపడ్డా ఒక్క నిబంధన దగ్గర కొచ్చేటప్పటికి పెద్ద చిక్కు వచ్చిపడింది. అదేదో మీరు వినాలి. పొగత్రాగటం ఉత్తర హిందూస్థానంలో దాదాపు సాధువులందరికీ అలవాటే, దాన్ని దోషంగా ఎవ్వరూ భావించరు. కాని స్వామీజీ రామకృష్ణ మిషన్ సాధువుల్లోనైనా యీ అలవాటును ప్రోత్సహించ కూడదని నిశ్చయించుకున్నారు. కాని వెసులుబాటుకోసం చుట్ట మాత్రం తాగేందుకు అవకాశం కల్పించాలనుకున్నారు. "చుట్ట తప్ప వేరే ఏదీ కాల్చకూడదు" అన్న నిషేధాన్ని విధి రూపంలో పెట్టడంఎలా? అందరూ చుట్ట కాల్చవలెనని చెబుదామా? చుట్ట మాత్రం కాల్చవచ్చునని చెబుదామా? ఏదైనా అదిమాత్రం

తన వుద్దేశ్యం కాదాయె: స్వామీజీ అంతటివాణ్ణే అలా వేధించింది మన శాసన మర్యాద !

క్రీస్తూ, బుద్ధుడూ, వివేకానందుడూ అందరూ Positive values కోసం, విధిరూపంలో వుండే శాసనాల కోసం, తాపత్రయ పడితే మన పురాణ సంప్రదాయాన్ని అంటిపెట్టుకున్న హిందూ మతం మాత్రం Imperative గా Positive గా వుండే నిబంధనల విలువను గుర్తించనేలేదు. దానిచే ప్రభావితమైన మన సమాజంలో Negative values కోకొల్లలుగా నాగజెముడులా పెరిగి పోతున్నాయి.

ఆధునిక మనస్తత్వ శాస్త్రం యీ వద్దు, కాదు, కూడదు అన్న వ్యతిరేకార్థక సూత్రాలు మంచివికావని చెబుతుంది. సమాజంలో ప్రచురంగా Positive values, Imperative Principles కావాలంటే, తప్పనిసరిగా Positivity యొక్క అమోఘ ప్రభావం మనందరి మనసుల్లోకి రావాలంటే, మన స్మృతి పురాణ యితిహాసాల్లోని నిషేధాలను తిరగ వ్రాసుకోవాలి. లేదా యీ క్రొత్త వెలుగులో వ్యాఖ్యానించుకోవాలి, వ్యష్టిజీవనానికీ, సంఘ జీవనానికి యిది ఎంత ముఖ్యమో చెప్పలేను.

నా మట్టుకు నేను ఆంధ్ర పత్రికలోని పద్యాన్ని క్రీస్తు వివేకానందుల ఆలోచనా మార్గంలో యిలా తిరగ వ్రాసుకున్నాను నా హృదయంలో.

"ఒరులేయవి యొనరించిన
నరవర అతిప్రియంబు తన మనంబునకగుతా
నొరులకు నవి చేయుమనికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్

దీనిలో యతితప్పినా, గతితప్పినా పరవాలేదుగాని మతి పెరుగుతుందని నాకొక విశ్వాసం. ఈ మార్పువల్ల మన భారతం లోని ఒక గొప్ప పద్యానికి బాహ్యరూపందృష్ట్యా కొంత వక్రత వచ్చినా ఆంతరమైన హృదయ సౌందర్యం వేయిరెట్లు పెరిగిం దని నేను నమ్ముతాను.

# మేఘాల్లో కూచున్న దేవుడు?

నీవు దైవానివి నేను దైవాన్ని. మనిషే దైవం మానవ సంఘంగా వ్యక్తమయిన యీ దైవమే అన్నీ చేస్తున్నాడు. ఇతడుగాక వేరొక దైవం పైనెక్కడో కూర్చుని వున్నాడా? Is there a different God sitting high up somewhere? అని సూటిగా ప్రశ్నించినవారు వివేకానందస్వామి.

'సర్వ జీవాత్మల సమష్టి అయి వున్నట్టి ఒకే ఒక దైవాన్ని -నేను నమ్మే ఆ ఒక్క దైవాన్ని - పూజించటం కోసం, నేను యీ లోకంలో మళ్ళా మళ్ళాపుట్టి వేలకొలది కష్టాలను భరించటానికి సిద్ధంగా వున్నాను; ముఖ్యంగా నా క్రూర నారాయణులు, నా హీన నారాయణులు, అన్ని మతాల్లో, అన్ని తెగల్లోవున్న నా దరిద్ర నారాయణులను ప్రత్యేకంగా అర్చిస్తాను' అని వేదాంత విప్లవ శంఖాన్ని స్వామీజీ పూరించిన తర్వాతనే పొరుగు ఏడ్పులకు బధిరులై కునుకుతున్న శుష్క వేదాంతులు అయిష్టంగానైనా మేలుకున్నారు.

ముక్తగళంతో " we are the servants of that God Who by the Ignorant is called Man " అని ఉద్ఘోషించా

రాయన. స్వామీజీ మాటల్లోని మహత్తర విద్యుత్తు మన గుండె ల్లోని నిద్రాణ మానవతను ముట్టడించి తీరుతుంది.

నవసమాజానికి శ్రీ రా మ ర క్ష గా వివేకానందుడిచ్చిన 'మానవసేవాదీక్ష' కేవలం తన గురుదేవుని భిక్ష అంటారు స్వామీజీ. ఇది నూరేళ్ళనాటిమాట. కలకత్తాకు చేరువలో ప్రశాంత మయిన దక్షిణేశ్వర కాళికాలయంలో శ్రీరామకృష్ణుని నివాసం. స్వామీజీ-అప్పటికి నరేంద్రనాథ్ దత్తా-ఒకనాడు గురుదేవుడయిన శ్రీరామకృష్ణుని సమీపించి ఒక కోరిక చెప్పుకున్నాడు. ఏ ఆధ్యా త్మిక సాధకుడయినా కోరుకునే సహజమైన కోరిక అది. తను నిర్వికల్ప సమాధిని అనుభవించాలని! ఈ లోకమూ - తనూ - దైవమూ ఏకమై ఒకేఒక ఎరుకగా అవికల్పంగా, అపరిచ్ఛిన్నంగా ప్రకాశించే ఏకత్వం అనుభూతం కావాలని. ఇది ఎవరి అనుభూతీ కావట అనుభవించే తానూ వుండక ఏకత్వమే భాసిస్తుందని అం టాయి శాస్త్రాలు. ఈ కోర్కెవిని సంతోషించి 'ఆహా నాశిష్యు డికి కాబట్టి యింత గొప్ప కోర్కె కలిగింది, ఉత్తమ ముముక్షువు లక్షణం యిది' అని ఉక్కిరి బిక్కిరి అయి శిష్యుణ్ణి కౌగిలించుకో లేదు శ్రీరామకృష్ణుడు. మరి ఏం చేశారని?

'నీవుకూడా యింత క్షుద్రమైన కోరిక కోరుతావనుకోలేదు. ఇంతకంటె వున్నతస్థితి యింకొకటిలేదా? చరాచర ప్రపంచము

నీవే పరాత్పరా అని నీవు ఎప్పుడూ పాడుతూ వుంటావే దాని అర్థం ఏమనుకుంటున్నావు?' అని నాలుగు చీవాట్లు పెట్టారు.

ఒకే గంతులో తమస్సులో నుంచి తేజస్సులోకి దూకినట్లయింది నరేంద్రుడికి. కళ్ళు మూసుకుంటే వుండే యీశ్వరుడు కళ్ళు తెరిచినా వున్నాడు. చూచే కళ్ళే కావాలిగాని కట్టెదుటే తిరుగుతున్నాడు దైవం అని అర్థం చేసుకున్నాడు నరేన్. తన మోక్షం కోసం మాత్రమే తాను ప్రయత్నిస్తూ ముక్కుమూసుక కూర్చోవటం ఎంతో క్షుద్రంగా, అల్పంగా కనుపించింది నరేంద్రుడికి. గురుదేవుని మందలింపు ఎంతో అందగించి కన్పించింది అప్పుడాయనకు. ఉలిదెబ్బలు తిన్న రాయే విగ్రహమై పూజింపబడుతున్నది. మనసుకు బలవదాఘాతాలు - కొంగ్రొత్త భావాల రూపంలో-ఎన్నో తగిలిన తర్వాతనే నరేంద్రుడు వివేకానందుడయ్యాడు.

ఒకనాడు శ్రీరామకృష్ణుడు వైష్ణవ ధర్మాలను గురించి చైతన్య దేవుడు చెప్పిన మాటలను వివరిస్తున్నాడు. నామేర్ రుచి, జీవేర్ దయ, భాగవతేర్ సేవ (భగవన్నామందు రుచి, జీవులయందు దయ, భగవద్భక్తుల సేవ) అను మూడు విశేషాలను వివరిస్తూ భావసమాధిలోకి వెళ్ళారు, శ్రీరామకృష్ణుడు. కొంచెంగా బాహ్యస్మృతి వచ్చిన వెంటనే ఆయన 'జీవులయందు దయ అట! ఓరి మూర్ఖుడా! నేలమీద ప్రాకేపురుగు వంటివాడివి నీవా యితరులపై దయచూపు వాడివి? ప్రతి జీవి

కూడా సాక్షాత్తు భగవత్ స్వరూపమే అని గ్రహించి నీవు చేయ వలసినదది జీవసేవ. జీవకారుణ్యము అనేది ఒత్తిమూర్ఖప్రలాపము అటూ గొణుక్కోవటం గురితోపాటు నరేంద్రుడూ విన్నాడు కాని ఆ మాటలలోని గంభీరార్థం నరేంద్రుణ్ణి మాత్రమే ఆకట్టు కున్నది. 'ప్రతి మానవుడు భగవత్స్వరూపుడే అని గ్రహించి ఎవరు మానవసేవ చేస్తాడో వాడికి మోక్షం కరతలామలకం. భగ వదనుగ్రహంవుంటే నేను యీ మహత్తర సత్యాన్ని చాటటంగా ప్రపంచానికి చాటే సుదినం వచ్చితీరుతుంది'' అన్నారట అక్కడ వున్న మిత్రులతో.

ఆ సుదినం నిజంగానే వచ్చింది వివేకానందుడయిన నరేం ద్రుని జీవితంలోకి. మానవసేవయే మాధవసేవ అనే అతని అమోఘ సిద్ధాంతాన్ని రెండు చేతులూచాచి స్వీకరించింది లోకం. స్వామీజీ సమాజ శ్రేయస్సు కోసం ముఖ్యంగా జనసామాన్యం యొక్క సంక్షేమం కోసం ఆరాటపడడం తన సన్యాస ఆదర్శానికి ఎంతమాత్రమూ విరుద్ధం కాదని తెలుసుకున్నాడు. నిజానికి శ్రీరామకృష్ణుని బోధనలోని వైశిష్ట్యం అదేనని గుర్తించాడు.

కళ్లు మూసుకున్నప్పుడుండే యీశ్వరుడు కళ్లు తెరిచే టప్పటికి మాయమౌతాడా? ఏ రూపమూలేని ఆ దైవం అన్ని రూపాల్లోనూ వుంటుందని స్వామీజీ గ్రహించారు.

ఈశ్వరుడిప్పుడు — మారాం పెట్టకుండా మరో మాట లేకుండా మేఘాల్లోంచి సంఘంలోకి దిగి వచ్చేశాడు. తన దివ్యత్వాన్ని మరచిన దైవమే మనిషి, తన స్వరూప స్మృతిలభించిన మనిషే దైవం అనే స్వామీజీబోధ ఆనాటి యువతరాన్ని, మేధావులనూ ముగ్ధులను చేసింది.

ఈ సరిక్రొత్త రూపంలో సాక్షాత్కరించటంతో ఈశ్వరునకు చేయవలసిన అర్చనల రూపం సైతం మారవలసి వచ్చింది. ఆయనపట్ల చేసే అపరాధాలు సైతం కొత్త రూపుల్లో కనుపించసాగాయి. శివాపరాధ మంటే సమాజ ద్రోహమని తేలింది.

# నిషేధాలూ - క్రీస్తూ

టెన్‌కమాండ్‌మెంట్స్ సినిమా చూశారా మీరు? ఎలా వుంది? దానికథా కమామీషు మనకిప్పుడు కొంచెం అక్కరకు వస్తుంది!

అది Old Testament- తాలూకు కథ అని మీరు వినేవుంటారు. అంటే క్రీస్తు పుట్టుక ముందటిదని. హోరబ్ కొండమీద మోసెస్‌ను దేవుడు పల్కరించటమూ, అగ్నిజ్వాలలతో చెక్కబడిన దేవుని పది ఆజ్ఞలూవున్న రెండు ఫలకాలు ఆయనకు లభించటమూ, ఆరెండు ఫలకాలను పట్టుకొని చక్కగా కొండదిగి రావడమూ....మీకు గుర్తొచ్చిందికదూ.

ఆ పది ఆజ్ఞల్లోనూ చివరి అయిదు ఆజ్ఞలూ తెలుగు బైబిల్లో ఇలావున్నాయి:- "నరహత్య చేయకూడదు, వ్యభిచరించకూడదు, దొంగిలించకూడదు, నీ పొరుగువాని మీద అబద్ధ సాక్ష్యము పలుకకూడదు; నీ పొరుగువానిది అగుదేనినీ ఆశింపకూడదు [ఆఖరు ఆజ్ఞ క్లుప్తీకరించినది] ఇందులో ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే యివన్నీ నిషేధరూపంలోవున్న ఆజ్ఞలు కావటమే. యూదుల మతమైన జుడాయిజంకూడా హిందూమతా

నికి ఏమాత్రమూ తీసిపోని నిషేధాలపుట్టగా కన్పిస్తుంది విశ్వాసం ప్రధానంగా వుండే మత వ్యవస్థ ఆనాటిది. దేవుడి ఆజ్ఞలు కూడా కాలానుగుణ్యంగా, సమయానుకూలంగా వున్నట్లు కన్పిస్తుంది, సర్వజ్ఞుడైన దేవుడు సమయజ్ఞుడు కాకపోతాడా!

అప్పటి మతవ్యవస్థ ఎరుకమీదగాక నమ్మకంమీద ఆధారపడింది కాబట్టి యిన్ని నిషేధాలు పుట్టడమేగాక, వాటివెన కాల నరకమనే బూచికూడా విల్చునివుంది. ఈ ఆజ్ఞలను మీరితే నాటి దేవుడికి పెద్దకోపం రావడమూ, వాడి ఆత్మ నరకంలో నానా యాతనలు అనుభవించాల్సి రావడమూ వుండేది. అసలే చలిదే శాల్లో పుట్టి చలిఅంటేనే భయపడి చచ్చేవాళ్ళకు నరకానికిపోయినా భయంకరమైనచలి వుంటుందన్న విశ్వాసాన్ని కలిగించారు ఆ నర కాన్ని సృష్టించిన పెద్దలు. పైగా పునర్జన్మమీద విశ్వాసంలేదు కాబట్టి చచ్చేంత చలిలో Doom's Day దాకా కాచుక్కూచోడం భయంకరమైన విషయమే.

ఈ యూదు మతంలోనే మోసెస్ తర్వాత కొన్ని వందల ఏళ్ళకు జీసస్ పుట్టాడు. జీసస్ తలిదండ్రులు ఆయన్ని కూడా మోసెస్ ధర్మశాస్త్ర ప్రకారమే పెంచుకొచ్చారు. కానీ, జీసెస్ కారణజన్ముడు కాబట్టి శతాబ్దాలుగా ప్రజల మధ్యనవుంటూ వచ్చిన మోసెస్ ధర్మశాస్త్రం Mosaic law ప్రజల్ని యేవిధంగానూ వృద్ధి రించలేక పోయిందని గ్రహించాడు. చంపగూడదన్న ఆజ్ఞను

చంపేవాళ్ళ లెక్క చెయ్యటంలేదు, వ్యభిచరించవద్దన్న ఆజ్ఞను కామాతురులు ఖాతరుచేయటంలేదు. అబద్ధాలు కూడదన్న ఆజ్ఞను అబద్ధాలకోరులు మన్నించటంలేదు. యిలా ప్రజలు ప్రకృతి ధర్మాన్ని పాటిస్తూ, శాస్త్రధర్మాన్ని పట్టిచ్చుకున్న పాపాన పోలేదు. నిషేధాలను పాటించటానికి మానవ ప్రకృతి సహజంగానే ఎదురు తిరుగుతుందని మనం అనుకున్నాం కదూ! నరకమన్నా భయపడకుండా యెవరిదారిన వాళ్ళుపోవటం గమనించాడు క్రీస్తు.

యీ నిషేధాలంటే ప్రజలకు వళ్ళుమంట అని జీసెస్‌కు తెలుసు. అందుకోసమనే క్రీస్తు తాలూకు ధర్మశాస్త్రం ఏదిపో గూడనిచోటో చెప్పటం మానుకుని, యేది పొందదగిన గమ్యమో చెప్పింది, ఏది భయంకరమో దాన్ని విడిచిపెట్టి యేది శుభం కరమో దాన్ని వివరించింది. యేది తప్పో, యేది పాపమో, ఏది నిషిద్ధమో చెప్పడానికి నిరాకరించి యేది ఒప్పో, యేది పుణ్యమో యేది కర్తవ్యమో దాన్నే నిర్దేశించింది. భాషలో ప్రకృతి విరుద్ధమైన నిషేధాలను నిసర్జించి భావంలో ఆధ్యాత్మిక ప్రగతి నిరోధకమైన వ్యతిరేక వైఖరిని త్రోసిపుచ్చింది క్రైస్తవం.

అయితే వ్యతిరేక వైఖరీ, నిషేధరూపమూ కలిగినటువంటి దేవుని పది ఆజ్ఞలమీద జీసస్ అడ్డ గీత గీసేశాడా? తన మతాన్ని కొత్త పునాదులమీద కట్టుకుని వచ్చాడా? అని మీరు

అడుగుతారేమో? మనకీ సందేహంలేకుండా వుండేందుకే ఆయన "ధర్మశాస్త్రమునైనను, ప్రవక్తల వచనములనైను కొట్టివేయ వచ్చితినని తలంచవద్దు; నెరవేర్చుటకేగాని కొట్టివేయుటకు నేను రాలేదు" అన్నాడు ఈ ఆజ్ఞల్లో ఎంత అల్పమైన ఆజ్ఞనైనా వుల్లంఘించి, ఎదుటివారికి అలా చెయ్యమని బోధించేవాడు చాలానికృష్టుడని కూడా చెప్పివున్నాడు. (మాత్యూ 5 అ.)

క్రీస్తు జుడాయిజానికి లోతూ వైశాల్యమూ కల్పించటం ద్వారా క్రైస్తవ మతమనే కొత్త పేరుతో ఒక మతం రావటానికి కారణభూతమైనాడు. పూర్ణత్వం మనిషి ధ్యేయమని -Be ye Perfect even as your Father in Heaven is perfect ఒక మహోత్తమ ధ్యేయాన్ని ప్రసాదించి యీ విధి నిషేధాల విషవలయం నుంచి తప్పుకోవటమే పరమ గమ్యమని గమనించిన మహామనీషి ఏసు.

ఈ మహత్తర ధ్యేయాన్ని సాధించటానికి యిది కూడదు అదికూడదు అనే నిషేధాలు మాత్రం చాలుతాయా? నరహత్య చెయ్యకుండా వ్యభిచరించకుండా, దొంగిలించకుండా, అబద్ధపు సాక్ష్యాలకు పోకుండా వున్నంత మాత్రాన పూర్ణత్వం సిద్ధిస్తుందా? యివన్నీ వ్యతిరేక సుగుణాలు (Negative virtues). మావాడికి కోపంరాదు అనేది గొప్పకాంప్లిమెంటా! బహుశా మీ వాడు కోపాన్ని ద్వేషంగా మార్చుకుని గుండెల్లో దాచుకుని,

నవ్వుతూనే కాటేస్తాడేమో యేమో. ఆ సంగతి మీరు చెప్పలేదు కదా: మారంగడు పిరికివెధవేం కాడండోయ్ అంటాడు పొరుగింటి సన్యాసి. అయితే వాడు దొంగా? దగుల్బాజియా ముండల ముఠా కోరా? యేదైనా కావచ్చుగాని పిరికివాడు మాత్రంకాదు. యిలా ఎన్నయినా చెప్పవచ్చు నేను బీడీలు తాగను నిజమే, తాగుడు అలవాటుకూడా లేదు అంతా మిగిల్చి చీట్లపేకలో తగలేస్తాను. సరిపోయిందా! మొదటిరెండు తాక్కుపోవడాలూ నా పేక ఫ్రెండ్స్‌కే ఉపయోగకరంకదూ! Negative virtues కథ యిలా వుంటుంది. తరచుగా.

ఇలాగా, క్రీస్తు శాస్త్రిల (Scribes) నీతికంటెను, పరిసయ్యుల (Pharisees) నీతికంటెను మీ నీతి అధికము కానియెడల మీరు పరలోక రాజ్యములో ప్రవేశింపనేరరు అని మీతో చెప్పుచున్నాను" అన్నాడు. ఈ శాస్త్రిలు పరిసయ్యులు ఎవరనుకుంటున్నారు? ఇప్పటి మన పురోహితులకూ, అమాంబాపతు స్వాములవార్లకూ, చెవులో పూలుపెట్టుకొని బజారుకొచ్చే భక్తాగ్రేసర చక్రవర్తులకూ కేవలం తాతతండ్రుల వంటి పూర్వీకులు!

క్రీస్తు నీతిశాస్త్రంలో యీ వ్యతిరేక సుగుణాలకు విలువ లేదు. అంతా Positive గా వుండాలి. ఆ సుగుణాలు నిన్నూ, నీ చుట్టూ సమాజాన్ని బలపరచగలగాలి, ఫలపరచగలగాలి. అందుకే క్రీస్తు తన కొండమీది ప్రసంగంలో (మాత్యు 5-7 అధ్యా

యాలు) దేవుని పది ఆజ్ఞల్లోనూ కొన్ని ముఖ్యమైన వాటిని ప్రస్తా వించి వాటికి Positive రూపాన్ని తాపి నిషేధాజ్ఞలపట్ల తనకున్న తీవ్ర వ్యతిరేకతనూ, ప్రగతిశీలకమైన, ప్రయోజనాత్మకమైన, Positive attitude పట్ల తనకున్న ప్రేమాతిశయాన్ని వెల్లడించు కున్నాడు. ఉదాహరణకు తెలుగు బైబిల్లో మత్తయి 5 లోని క్రీస్తు మాటల్నే చూపుతాను:- "నరహత్య చేయవద్దు; నరహత్య చేయు వాడు విమర్శకు లోనగునని పూర్వీకులతో చెప్పబడినమాట మీరు విన్నారుగదా-నేను మీతో చెప్పునదేమనగా—తన సహోదరునిమీద కోపపడు ప్రతివాడు విమర్శకు లోనగును, తన సహోదరుని చూచి వ్యర్థుడా (Raca) అని చెప్పువాడు మహాసభకు (Council) లోనగును, ద్రోహి Fool) అని చెప్పువాడు నరకాగ్నికిలోనగును ............" ఇట్లాగే, 'వ్యభిచారము చేయవద్దని చెప్పబడిన మాట మీరు విన్నారుగదా! నేను మీతో చెప్పునదేమనగా ఒక స్త్రీని మోహము చూపుతోచూచు ప్రతివాడు అప్పుడే తన హృద యమందు ఆమెతో వ్యభిచారము చేసినవాడగును". ఇతర స్త్రీ విషయంలో కుడికన్ను తప్పుచేస్తే దాన్ని పెరికివేయ మంటాడా యన. ఎంతటి భావతీవ్రత! ఎంతటి భావౌన్నత్యము! ఇదే మత బోధలోనూ, సిద్ధాంతాలలోనూ క్రీస్తు సాధించిన విప్లవం!

క్రీస్తుకు యీ నిషేధరూపంలో వున్న ఆజ్ఞలంటే ఎంత వైముఖ్యమో, Positive Progressive, Purposeful బోధనలంటే ఎంత ప్రేమాతిశయమో మరో ఘట్టంలోనూ మనకు తెలుసు.

ఏసుక్రీస్తు తానై తన విధానానికి సరిపడ్డ కొన్ని ఆజ్ఞలను ప్రజలకు యివ్వలేదా? ఇది ఆసక్తికరమైన ప్రశ్న. ఇచ్చారు. వాటిని ఆజ్ఞలని పేరుపెట్టి పిలవడానికి ఆయన నిరాకరించాడు. అవి నిషేధాజ్ఞలుకావు సరికదా విధిరూపక ఆజ్ఞలయినావుకావి. మరి అవి ఏ రూపంలో వున్నాయి? ఎక్కడ వున్నాయి?

ప్రపంచంలోకల్లా Most Quoted Speech అని చెప్పబడ్డ కొండమీద వుపన్యాసం మొదట్లోనే వున్నాయి యీ ఆజ్ఞలు కాని ఆజ్ఞలు. ఆ కొండ ఏదోగాని మహా పవిత్రమైనది! దాన్ని పండితులు హెర్మెన్‌కొండ అనీ, Horns of Hattin అనీ తలోవిధంగా గుర్తుపడుతున్నారీమధ్య. క్రీస్తు యిచ్చిన ఉపదేశాలను "ధన్యతలు" అని ముద్దుగాపిలుస్తారు క్రైస్తవులు. సూటిగా టెలిగ్రాముల్లా చెప్పదల్చుకున్నది చెప్పే సూక్తులివి:

1. "ఆత్మ విషయమై దీనులైనవారు ధన్యులు; పరలోక రాజ్యము వారిది."

2. "దుఃఖపడువారు ధన్యులు, వారు ఓదార్చబడుదురు"

3. "సాత్వికులు ధన్యులు; వారు భూలోకమును స్వతంత్రించు కొందురు."

4. "నీతికొరకు ఆకలిదప్పికలైనవారు ధన్యులు; వారు తృప్తిపరచ బడుదురు."

5. "కనికరము గలవారు ధన్యులు; వారు కనికరము పొందుదురు."

యిలా సాగిపోతాయి. పాతకాలపు "బైబిల్ తెలుగుభాష" మనల్ని కొంత యిబ్బంది పెడుతుందిగాని యీ బోధనల్లోని విషయమూ,విధానమూ మానసికప్రవృత్తికి మచ్చుజల్లి ఆచరణవైపుకు మరలిస్తుంది. ఏదో దివ్యలోకాల అనిర్వ్వర్ణనీయ ప్రభావాన్ని మన గుండెల్లోకి ప్రసరింపచేస్తుందికదూ? ఎద్దైనా నిషేధరూపం గల భాషలో యింత గొప్పగా చెప్పడం సాధ్యమేమో చూడండి!

# మీ 'నేను' ఆరోగ్యంగా వుందా?

పంటి డాక్టరు నావి మూడుపళ్లు లాగేశాడు. 'పిప్పి పన్ను వచ్చాక కొంచెం తొందరగా మేలుకోవటం మంచిది. యీ వెధవ మూడుపళ్లూ పోతే మీ పీడే పోతుంది, లాగేస్తానని' నాకు నచ్చ చెప్పి మరీ పీకిపారేశాడు ఆ మూడుపళ్ళూ. ఆ పళ్ళు మళ్ళా యీ వయస్సులో మొలవ్వు. సెట్టు కట్టించుకొని పర్మెనెంటుగా బిగించుకోవటమో లేక రోజూ బయటకుతీసి కడిగి శుభ్రంచేసి మళ్ళీ నోట్లో అతికించుకొనే ఏర్పాటు చేసుకోవటమూ అనేది నా సమస్య. నాపళ్ళ సమస్యతో నేనిలా సతమతమౌతుంటే ప్రక్కింటి ప్రకాశం ఎప్పుడూ అస్సాంలో జలప్రళయం గురించో, బంగ్లా దేశ్‌లో జనప్రళయం గురించో, రాయలసీమ కరువుగురించో యేదోఒకటి చెప్పకరావటం నాకు సుతరామూ నచ్చదు. ఊడిపోయిన నా మూడు పళ్ళకంటే చచ్చిపోయిన ముప్పయి లక్షల బంగ్లా దేశీయులను గురించినబాధ యేమీ ఎక్కువకాదునాకు. ఈమాటలే ప్రక్కింటి ప్రకాశానికెన్నోసార్లు చెప్పినా అతని ధోరణి మారేట్లు లేదు ఖర్మ. సంఘాన్ని పీడిస్తున్న సమస్యలు మరీ పట్టించుకోకుండా బ్రతకడం యీ వయసు కుర్రవాడికి, హవ్వ, అన్యాయం అని ఒకటేగోల.

ఇండియాపై చైనా యుద్ధం చేయదంకన్నా నా చెవిపోటు సంగతి నాకు ముఖ్యం కాదంటారా? అదే నాకు పది అంతర్జాతీయ సమస్యలపెట్టు. చిన్నదానికి లోలాకులో, రింగులో ఏవో ఒకటి సాయంత్రానికి పట్టుకరావాలని మా ఆవిడ నాకిచ్చిన అల్టిమేటమ్ ఇజ్రాయిల్ ఈజిప్టుకు యిచ్చిన అల్టిమేటమ్ కంటె భయంకరమైన ప్రతిపత్తికలది 'ఈ లోకంలో నీకో చక్కటి ద్వీపం వుంది నీవు అందులో రాబిన్‌సన్ క్రుసోవలె బ్రతగ్గలిగితే నీక్కీ పొరుగుగొడవలు చెప్పి వేధించనురా, అబ్బీ. సమాజం నీకు ఎంతో కొంత యిస్తున్నది. పరోక్షంగానైనా నీకు కూడూగుడ్డ సమకూరుస్తున్నది. తొనుపు దగ్గర్నుంచీ కాలుపుదాకా పొరుగువాళ్ళు లేకుండా నీ బ్రతుకు తెల్లారటంలేదని గుర్తుంచుకో' మని నిగ్గదీసి వేధిస్తాడు ప్రకాశం. నేను సృజించని సమాజాన్ని నేను శాసించనూలేను. వారగపెట్టుకుని యీ కాస్తకాలం తెల్లవార్చుకుంటే సరిపోతుందంటాను నేను. ఉడుతకెందుకయ్యా వూళ్ళో వార్తలూ అని నేనంటే నీవు ఉడతవా అని వుడికిస్తాడు ఆతగాడు.

నిజమే. అయ్యవారిపనో, గుమాస్తాగిరో సలక్షణంగా సాగిపోతుంటే, సిబ్బంది గుమాస్తా నెలాఖరున శెలవుపెట్టకుండా, ఆఫీసరు వూళ్ళవెంట క్యాంపు పోకుండా సంతకాలుచేసి వాటో తారీకు యేచిక్కు లేకుండా జీతం చేతిలోకొచ్చి సంసారాన్ని యీడ్చుకపోతే చాలంటాడు సగటు వుద్యోగి. ఆతని సానుభూతి సహాయాలు పొరుగువాళ్ళకు కావల్సినదానికంటె పొరుగువాళ్ళ

సాన భూతి సహాయాలు అతనికే ఎక్కువ అక్కర అనిపిస్తుంది మనకు. కాని తను ఆవిధంగా ఎదుగు బొదుగులేకుండా పడివుండ టానికి యీ సామాజికవ్యవస్థ. ఆర్థిక, రాజకీయవ్యవస్థ ఎంతవరకు కారణమా అని తలఎత్తి చుట్టూ ప్రపంచాన్నిచూస్తే మన గుమస్తా రావుకూ మంచిదే. పుట్టకముందే తను మోసగింపబడ్డాడనీ, కాలు ముందుకు పెట్టకముందే చతికిలపడి వున్నాడనీ సగటు మనిషి అవగాహన చేసుకోకుండా వున్నంతకాలం ఈ వ్యవస్థ-వీళ్ళ అవస్థ ఎన్నటికీ మారదు. ఈ అవగాహన లోకోద్ధరణం కోసంకాదు తన కోసమేనని అతడు తెలుసుకోవాలి. నేను బోధించేదీ దూరపు చూపుగల స్వార్థమే బాబూ.

స్వార్థం సహజమైనదనీ. అన్నిటికీ 'నేను' ముందనీ మనకు తెలుసు. న్యూయార్కు టెలిఫోన్ డిపార్టుమెంటు వాళ్లు ఒక సర్వే చేశారట ఇంతమంది ఆసాములు ఫోన్లు వాడుతుంటారే, యిన్ని మాటలు మాట్లాడుతుంటారే, అన్నిట్లోకి ఎక్కువసార్లు వాడబడే పదం ఏమిటీ అని వాళ్ళ పరిశోధన నేను, నేను, నేను, నేను.... ఆ( అదీ. యీ 'నేను' దొరికింది వాళ్ళకు ఎక్కువసార్లు వాడబడే మాటగా.

మనం ఒక గ్రూపు ఫోటోలోవున్నాం అనుకుందాం ఫోటో స్టూడియోనుంచి ఫోటో వచ్చింది. ఆ ఫోటో చేతిలోకి తీసుకొని మీరు—మీరంటే మీరేనండీ—యేం జేస్తారో చెప్పండి? ఎవరి

ఫోటో ముందు చూస్తారూ? నే చెప్పనా. తొట్టతొలిసారి మీకళ్ళు వెదికేది ఆ ఫోటోలో మీ సుందర ముఖారవిందం కోసమే. ఆ తర్వాతనే మీ ఆఫీసరైనా, ప్రిన్సిపాలైనా, కలెక్టరైనా. గవర్న రయినా, యింకెవరైనా....ముచ్చటగా మొదట మీరూ ఆ తర్వాత యీ ప్రపంచమూ....కదూ? మనం పొగడడం చూడండి. నాదాకా రాకుంటే ఎదుటివాణ్ణి సర్వజ్ఞుడు అని కూడా అనగలను. నా అహం దెబ్బతిన్నాక ఆ సర్వజ్ఞుడే ఏమితెలియనివాడై వీధుల వెంట తిరిగే బికారికుంక అవుతాడు! అవునా 'నేనూ'!

అందుకోసమే యీ 'నేను' మనల్ని నమలిమింగేస్తున్నది. దాని శక్తిని వర్ణించటానికి ఆదికవి నన్నయ దగ్గర్నుంచీ అంతా లేచివచ్చినా సరిపోరు ఈ నేను ప్రాభవంమీద నేనైనా ఒక వుద్గ్రంధం రాసి పడేద్దునిగాని అదీ అసమగ్రంగానే ఏడుస్తుందని మానేస్తున్నాను.

అందరికీ 'నేను' ముఖ్యం. ఎవరీనేను, ఎందుకీనేను? ఈ నా 'నేను' వెనకాల యేముంది? వివేకానందస్వామివారి నేను వెనకాల, జయంతి ధర్మతేజ 'నేను' వెనకాల, మన యింటిపక్క సన్యాసిరావు నేను'వెనకాల, వీధులూడ్చే వీరమ్మ 'నేను' వెనకాల, యేమున్నది? ఒక్కమాటలో చెప్పాలంటే 'ప్రాముఖ్యం కోసం తహ తహ' (The desire for importance) వున్నది. అయితే యీ తహతహలో పోకడలు మారుతాయి మనిషికీ మనిషికీ.

జ్వాలాపతిగాడని ఓ గజదొంగ వుండేవాట యీ జిల్లాలోనే. వాడి గర్వం అంతా తను గొప్ప దొంగననీ 'నేనెవరో తెలుసా. జ్వాలాపతిని. అయినా నిన్నేమి చెయ్యనులే' అనేవాడట ఎవ రయినా అమాయకుడు తటస్థపడితే, నేనెవరో తెలుసా హెడ్ కానిస్టేబుల్ని అంటున్నాడు ఒకడు, హెడ్ బిరుసుగా. 'నేనొక మహత్తర సందేశాన్నిచ్చాను; దాని శక్తి కొన్ని వందల ఏళ్లు పనిచేస్తుంది. నేను చనిపోయినా నా ఆత్మశక్తి మిమ్మల్ని ముం దుకు నడిపిస్తుంది' అన్నారు వివేకానంద. నేను డ్రాఫ్ట్ రాశానంటే ఒక్క అక్షరం మారటానికి వీల్లేదని ఒక గుమాస్తా అంటే నేను గుమ్మడికాయ ముక్కలు తరిగితే తూచినా ముక్కకు ముక్క తేడా వుండదని ఓ వంటలక్క అంటుంది. నా బ్రతుక్కి పొరుగు గొడ వలు కూడానా అని ఒక ఆసామీ దీనంగా అంటే నా గొడవలకే నాకు తీరికలేదు. ఎదుటికెక్కడ ఏడ్వనని తన యేడ్పులోనూ పోజు చూపుతాడు మరో అసామీ. ఒక కర్చిఫ్ గుడ్డంత చాలు నా జాకెట్టుకు అంటుందొక పొదుపరి అడగూతురు! ఇలా ఎన్నయినా చెప్పుకోవచ్చు మనం వాళ్ళ వాళ్ళ 'నేను' లను గురించి ఆ 'నేను' లను ఆశ్రయించిన విలువలనూ, కోరికలనూ గురించి.

సమాజానిక్కావలసిన 'నేను' లు సామాజిక సంక్షేమం కోసం వులాటబడే 'నేను'లు మాత్రమే. యద్భవిష్యలు-అంటే యేం జరిగితే అదే జరుగుతుంది లెద్దూ అనేవాళ్ళు. చదలువలె

పుట్టి చదలువలెనే రాలిపోతారు. అలాటి వాళ్ళతో నిండిన సమాజం కుళ్ళిబారిపోతుంది శరవేగంతో.

తల్లో వెంట్రుకలు నెరవటం మొదలైన ప్రతివాడూ నేటి యువతరాన్ని తిట్టిపోస్తున్నాడు. ఈ నిందారోపణలు యువ తరాన్ని పతనాన్నుంచి కాపాడగలవా? అసహనానికీ అజ్ఞానానికీ చిహ్నమైన కువిమర్శ యువతా చైతన్యాన్ని సరియైన దారిలో పెట్టగలదా? సందేహమే. మనస్తత్వ శాస్త్రరీత్యా అది అసంభ వంకూడా. అమాంబాపతు మత సిద్ధాంతాలను వల్లిస్తూ, విభూతి మహాత్మ్యాన్నీ, మాఘస్నాన మహాఫలాన్ని బోధిస్తూ కాలంగడిపే నూర్లకొలది, వేలకొలది స్వాములవార్లు, ఆధ్యాత్మిక బోధకులు, రాజకీయవాదులు కానట్టి మేధావులూ మనిషికీ మనిషికీ వుండే ఆత్మపరమైన సంబంధాన్ని మన యువతరానికి నూరిపోయాలి, మనిషిగా మనిషి పొందగల-అందుకోగల ఆశయాలను అందుకు సాధన భూతమైన ఆత్మవిశ్వాసాన్ని యువకులు సొంతం చేసు కునేటట్లు ప్రోత్సహించాలి ఈ ఆత్మవిశ్వాసాన్నే. సగటు మనిషి 'నేను' వెనుకాల గూఢంగావుండే మానవశక్తినే మనం జాగృతం చెయ్యాలి.

"పాత మతాలు భగవంతుని నమ్మనివాణ్ణి నాస్తికుడన్నాయి కాని, యీ కొత్తమతం, తనశక్తిని తాను నమ్మనివాణ్ణి నాస్తికుడు అంటుంది" అన్నారు వివేకానందస్వామి ఆత్మవిశ్వాసం లేనివాడే

నాస్తికుడు. "He is an atheist who does not believe in himself." ప్రపంచ చరిత్ర అంటే తమపై తమకు విశ్వాసం గల కొద్ది మంది చరిత్రే. The history of the world is the history of a few men who had faith in themselves.

స్వామీజీ మరొకచోట " పురాణాల్లో చెప్పిన ముప్పై మూడు కోట్ల దేవతలమీద, యింకా విదేశీయులు మనకు వంప కంచేసిన విదేశీ దేవతలమీదా నీకు విశ్వాసం వున్నా. నీమీద నీకు విశ్వాసం లేకుంటే మాత్రం నీకు మోక్షంలేదు" అన్నారు.

"మీరందరు ఘనకార్యాలను సాధించటానికి పుట్టినవారేనని విశ్వసించండి". Have faith that you are all born to do great things అని యువకులను వుద్బోధించారు వివేకానంద.

ఘనకార్యాలను సాధించటానికి సంసిద్ధమైన 'నేను' మీకున్నదా? అయితే మీ 'నేను' అద్భుతంగా వున్నది. నేనెందుకూ పనికిరానని నీరు కారిపొయ్యే 'నేను' వుందేమో చూచుకోండి: అప్పుడు మీ 'నేను' ఆరోగ్యంగాలేదు.

సమాజాభ్యుదయ సాధన యజ్ఞంలో నేనూ ఒక సమిధ నౌతాను అనే మంచి తలపు మీకుంటేచాలు మీ "నేను" ఆరోగ్యంగా వున్నట్లే.

# మిస్టర్ రాహుకాలం

మారుపేర్లు పెట్టి పిలవడం పోకిరిచేష్టల కిందికివస్తుంది. కానీ, ఒక్కొక్క మారుపేరు వింటుంటే మనకు ఎంత సద్యోజాత మైన ఆనందానుభూతి కల్గుతుందంటారు! మీ అనుభవంలో వుండే మారుపేర్లను గురించే చెప్పండి! యిప్పుడు మీకు ఒక్కొక్కటే గుర్తుకొస్తున్నాయ్ కదూ.... మొన్న మన ప్రకాశం రాహుకాలాన్ని ట్రంకురోడ్డులో వెళ్తుంటే నాకు చూపించాడు. పంచాంగాల్లో వుం డాల్సిన రాహుకాలం వీధిన ఎలాపడిందా అని సందేహం, మీకు! రాహుకాలం అంటే వాళ్ళ ఆఫీసు హెడ్‌గుమస్తా అండీ!

ఈ రాహుకాలం అనేది అచ్చం అరవ సరుకు. శాస్త్రరీత్యా కూడా తెలుగువాళ్ళకు వర్జ్యం, వారం చాలట. మన రాహుకాలం గారిది కూడా దక్షిణాదే, బహుశా తిరునల్వేలి.

రాహుకాలం అంటే ఆయనకు బహు పట్టింపు అది ప్రతి రోజూ పగటిపూట ఒకటిన్నర గంటలు వుంటుంది ఏదో టైంలో. ఆ సమయంలో మన రాహుకాలం గాలి పీల్చడంకూడా మానుకునే వాడే, తప్పున చచ్చి వూరుకుంటానే అని గాలి మాత్రం పీల్చు కుంటాడు! ఆయన సొంతకాలాన్ని గాని, ప్రభుత్వానికి అమ్మేసు

కున్న కాలాన్ని గాని రోజూ $1\frac{1}{2}$ గంటలపాటు యిలా న_బ్బుగా గడిపేస్తాడు. కాగితం, కలం, ముట్టడు. మనుషుల్ని పల్కరించడు అధవా ఎవరైనా పల్కరించినా భయపడతాడు. తనకేదో అశుభం జరుగుతుందనీ, తగాదాలొస్తాయనీ ఆయన భయం!

ఇంతమటుకు, అందరికీ తెలిసినా ఎవరూ పట్టించుకోలేదు పేర్లూపెట్టి పిలువలేదు' మూణ్ణెల్ల ముందుగా మోసు యిన్‌స్పెక్షన్ పార్టీవాళ్ళొచ్చారు హైద్రాబాద్ నుంచి. వచ్చిన తనిఖీ ఆఫీసరు యీ హెడ్‌గుమస్తాను పిలిచి రికార్డులన్నీ తనిఖీకి తీసుకరమ్మన్నా రట! "ఇదోసార్, ఒకే నిముషం, అన్నీ రెడిగా వున్నాయ్ పట్టు కొస్తానని' చెప్పి తన రూంలోకి వచ్చాడట. హెడ్‌గుమాస్తా సీటు ముందరికి రాగానే ఎదురుగుండా వుండే గోడగడియారం అమాయకంగా ఠంగ్‌మని గంటకొట్టింది. సీటు ముందర నిల్చుని బల్లమీద రికార్డు చూస్తున్న ఆసామి కాస్తా గంట చూస్తూనే నిలు వునా కుర్చీలో కూలబడి పోయాడు! ఆ రోజు శు క్ర వా రం అయింది! 10-30 నుంచీ 12 దాకా రాహుకాలం. ఇక కదలడే మానవుడు! ఇన్‌స్పెక్టింగ్ ఆఫీసరు కబురుచేశాడు. ఉహుఁ-మళ్ళీ, మళ్ళీ జవాన్లు వచ్చి, రికార్డు వెంటనే కావాలట అని చెప్పి పోతున్నారు. తనిఖీ సిబ్బంది, ఆఫీసరూ, ఎగిరిపడ్డా లాభంలేక పోయింది. ఈ రగడ సొంత బాస్‌కి తెలిసి నాల్గు చీవాట్లుపెట్టి పంపించాడు. అయినా లాభంలేదు; రికార్డు తనిఖీకి సబ్మిట్ చెయ్య

లేదు. వచ్చిన ఆఫీసరు ఇన్‌స్పెక్షన్ నోట్సులో ఆమాటేరాసేశాడు. బాస్ ఆగ్రహించి ఒక యింక్రిమెంటు కట్‌చేశాడు! సంజాయిషీ అడిగినప్పుడు కూడా, "రాహుకాలంలో నేనేపని చెయ్యలేనసార్. చేస్తే నాకు యేమౌతుందోనని భయం'. అని చెప్పుకున్నాడు. ఆఫీసరుకు కోపంవచ్చి, 'ఇప్పుడయింది ఎందు కనుకున్నావ్, రాహుకాలంలో పనిచేసినందుకుగాదు. రాహుకాలంలో పనిచెయ్యనందుకు. తెలిసిందా? మరొకసారి మీరాహుకాలం డ్యూటీకి అడ్డంవస్తే బహుకాలం మీకు ప్రమోషనేగాక యింక్రిమెంట్లూ వుండవు' అని గద్దించాడట.

ఇదండీ, జరిగింది. అప్పటినుంచీ ఆ హెడ్‌గుమాస్తా మిస్టర్ రాహుకాలంగా స్థిరపడి పోయ్యాడు. రోడ్డంట నడుస్తున్న రాహుకాలం; ఆఫీసులో పనిచేస్తున్న రాహుకాలం; ఆఫీసరు ముందు చేతులు కట్టుక నిల్చుకున్న రాహుకాలం; హెడ్డు గుమస్తాగా రూపొందింది ఘ న త వ హిం చి న రాహుకాలం. నయం! ఏ ప్రధాన మంత్రినో, సైన్యాధిపతినో యీ రాహుకాలం ఆవేశిస్తే చరిత్రే మా రి పో యే ది. కేవలం హెడ్డుగుమాస్తాతో సరిపెట్టుకూర్చుంది!

మహాత్ములన్నవారికి మంగళహారతులు పాడటం రివాజు, గుళ్ళో సాగిలపడటం అందరికీ తెలుసు! నాకూ తెలుసుననుకోండి.

రెండు శ్రీలూ, రెండు పెగ్గులూ (పెగ్గులుగాక మగ్గులైనా బాధ లేదు) ధరించిన శ్రీ శ్రీని తల్చుకోకుండా నాకు జరుగదు. ఆ ప్రబోధ వేద వేధను ఏగుళ్ళోనూపెట్టి ఆరాధించడం కూడదు. బ్రహ్మకుమల్లేనే. కాని, మన మధ్యనున్న శ్రీ శ్రీ మాటల్ని మనం మరచిపోతే మాత్రం బాగుంటుందా?

ఎముకలు క్రుళ్ళిన
వయస్సు మళ్ళిన
సోమరులారా, చావండి.
నెత్తురుమండే
శక్తులు నిండే
సైనికులారా, రారండి

అని ఎలుగెత్తికేకేసింది శ్రీశ్రీయేకదూ ?

పాలగుమ్మి పద్మరాజుగారు చాలయేళ్ళకింద నెల్లూరుటౌను హాల్లో మాట్లాడుతూ యిలా అన్నారు. ఇప్పుడు రెండే రెండు అవస్థలున్నాయ్ మనకు. ఒకటి బాల్యమూ, రెండోది వార్థక్యమూ. బాల్య యౌవనకౌమార వార్ధక్యావస్థల్లో యౌవన కౌమారాలు మన జీవితాల్లోనుంచి మాయమవటం పసందైన సంగతికదూ? ఎముకలు కుళ్ళటానికి వయస్సు మళ్ళఖ్ఖరలేదు! ఎముకలు కుళ్ళటమూ మూలుగులారటమూ, నడియవ్వనంలోనే జరగొచ్చు. లేదా ఎము కలు కుళ్ళకుండా, యవ్వనం వెళ్ళకుండా ఒక ప్రకాశం పంతులు

వలె, పండిట్జీవలె చావుదాకా యవ్వనంలో వుండొచ్చు. నిజానికి వాళ్ళు అకాలమరణం వాతను పడ్డవాళ్ళే. మనం మాత్రం సం దొమ్మిదేళ్ళకే ప్రాయసమృద్ధులమై పోతున్నాం!

ఇంతకూ మహాకవి శ్రీ శ్రీని యెందుకు సాయం కోరా ననుకుంటున్నారు? తల తెల్లబడిన తర్వాత, ఏడాదికొక కళ్ళ జోడు మార్చటం మొదలుపెట్టిన తర్వాత యెవడైనా ఓ హెడ్ గుమాస్తా రాహుకాలం అని పిలిపించుకుంటే నాకు ఏ అభ్యంతర మూలేదు. కాని రాహుకాలం జూనియర్స్ సంగతేమిటి? పసి తనంలో రాహుకాలం ఆవేశిస్తే యెంత భయంకరం? నూనూగు మీసాల నూత్న యవ్వనంలో వున్న రాహుకాలాలు కాలేజీల్లో, ఆఫీసుల్లో, అంగళ్ళలో, అంతటా వుండటం నన్ను ఆశ్చర్య చకి తుణ్ణి చేస్తున్న విషయం, బాధిస్తున్న విషయంకూడా.

మరొక్కమాట. మనస్తత్వ శాస్త్రజ్ఞులు కొన్ని మనోరుగ్మ తలను (Phobias) గుర్తించారు. ఈ ఫోబియాలు అనేకరకాలు. నిప్పంటే భయం: పిల్లులంటే భయం, కుక్కలంటే భయం, ఎంత భయమని, చచ్చేంత భయం! యివన్నీ పసితనంలో మనసుకు పట్టే భయాలుకాబట్టి వయసొచ్చిన తర్వాతగూడా వీళ్ళను యీ భయాలు విడిచిపెట్టవు. మంచిదే. కాని యీ రుగ్మతల్లో ట్రిస్కై డెకాఫోబియా అని ఒకటుంది అదేమిటో తెలుసునా? పదమూడో తారీఖంటే భయం. అసలు 13 సంఖ్య కన్పడితేనే భయం. ఇది

ఎలా ఏర్పడిందంటారు? మతం పేరుతో చెలామణి అయ్యే గితం సంఘంలోకి ప్రవేశపెట్టిన భీతియిది. కేవలం ముస్లిముల విశ్వాస మైనప్పటికీ మనమూ దీన్ని విడచిపెట్టం. మనుషులందరిలో ఇది ఫోబియాగా రూపొందకున్నా. మామూలు భయంగా బ్రతుకు తున్నది. అందుకే సరియైన సమాజానికి సరియైన మతవిశ్వాసాలూ విలువలూ కావాలని మొత్తుకునేది.

రాహుకాలమైతేనేం? పదమూడోతేదీ అయితేనేం? మను లను పిరికివాళ్ళగా, అశక్తులుగా, నిర్వీర్యులుగా చేసేందుకు ఏ విలువలు దోహదం చేస్తున్నాయో అవి దగ్ధం కావాలి. మన సమా జంలోంచి, ముఖ్యంగా యువతరంలోంచి అవి మటుమాయం కావాలి. ఏ మంత్రమోవేసి, ఏ తంత్రమోచేసి వీటిని విడిపించు కోలేం. ఏ ఉచ్చాటనకూ ఇవి బయటకురావు. సరియైన విలువల కోసం మనస్సు వెతుక్కుంటూ వెళ్ళకుండా, సంప్రదాయంతో సరిపెట్టుకుంటుంటే యీ అంధ విశ్వాసాలు మన మధ్యన చిరంజీ వులై ప్రకాశిస్తుంటాయి. అందుకే ఎంతో De hypno tization కావాలి. దీన్ని నాతో నేనూ, మీతో మీరూ మొదలుపెట్టు కుందాం.

ఈ సందర్భంలో వివేకానందస్వామి అన్న మాటలు ఎంతో విలువైనవి! 'నిన్ను బలహీనపర్చేదాన్ని దేనినీ నీవు స్వీకరించవద్దు నిన్ను బలపరచేదే నిజమైన మతం.''

# బల్లి శాస్త్రి కథ

"ఒరేయ్, సుబ్బులూ, వూరికేగాలికి తిరుగుతావుగాని ఒక చదువనీ, సంధ్యనీ అనుకోవేంరా. బ్రాంహడై పుట్టాక ఏదో ఒక శాస్త్రంలో ప్రావీణ్యత సంపాయించాలి. ఫలానావారి అబ్బాయి ఫలానా శాస్త్రంలో ఘట్టివాడు ఆని పేరు ప్రతిష్టలు తెచ్చువాల్రా,' అని వాళ్ళ నాయనమ్మ ఒకరోజు ఘట్టిగా చెప్పింది. అందుకోసమేనట మావూరి సుబ్బావధాన్లు యే శాస్త్రమైనా వొంటపట్టాలంటే యేళ్లూ, పూళ్లూ పడుతుందని తెలుసుకుని, వొంటికి కష్టంలేకుండా వుండే ఒక శాస్త్రం కోసం వెదకివేసారి, చివరకు పెద్దబాలశిక్షలో వుండే "బల్లిపడే శాస్త్రిము''ను సెలెక్టు చేసుకున్నాడు. నాయనమ్మ ఉవాచ వూరికేపోకుండా ఫలానా సుబ్బావధాన్లంటే బల్లిపడే శాస్త్రంలో ఘట్టివాడనే ప్రతిష్టే కాకుండా, అసలు 'బల్లిశాస్త్రి' అనే ముద్దు పేరునూ సంపాదించుకున్నాడు! ఎంతపెద్ద శాస్త్రాన్ని ఔపోసనంవట్టి శాస్త్రి బిరుదాన్ని గడించాడో మీరువిన్నారుగదూ!

చిన్నప్పుడు మేమంతా ఆ బల్లిశాస్త్రిగారింటికి పోయి. 'శాస్త్రిగారూ యీ రోజు బల్లి నెత్తిమీద పడిందండీ.... యీ రోజు ఎడం చేతిమీద పడింది.... యీ రోజు కుడిచేతి చూపుడువేలిమీద

పడింది....' అని చేతులు చూపిస్తూ చెబుతుంటే ఆయన కంప్యూటర్‌లాగ టకటకా ఫలితాలను చెప్పేవాడు! 'శిరస్సు....కలహం.... యీరోజు మీ యింట్లో గొప్ప తగాదా వుంటుంది'....వగైరా.... చెప్పేసేవాడు.

తగాదా రావడానికి మేము ఎదురు చూస్తుండేవాళ్ళం. కొంపలో నలుగురు పిల్లలుంటే బల్లి ప్రమేయం లేకుండానే తగాదా లొస్తాయో, లేదోగాని సాయంకాలానికి ఏదో ఒక తగాదా రావడం జరిగేది. తలచెడిన మా బామ్మగారు ముసి ముసి నవ్వులు నవ్వుతూ తగాదా వచ్చినందుకు మురిసిపొయ్యేది, 'బల్లిశాస్త్రి మాట ఖరార్రా' అని అభిభాషిస్తూ....'తగాదా' 'జోస్యంచెప్పింది' బల్లికదా, బామ్మా, నీ అభినందనలు నిజానికి దానికే చెందాలి' అనేవాణ్ణి నేను.

'మనవాళ్ళొట్టి వెధవాయలోయ్' అన్నది గిరీశం సొంత అభిప్రాయం మాత్రమే. ఇలాటి చీకుళ్ళూ, పీకుళ్ళూ తెచ్చిపెట్టిన బుర్రలతోనే వాటికి మినహాయింపుగా కొన్ని విరుగుళ్ళనూ సృష్టించారు, మనవాళ్ళు. ఉదాహరణకు, మా యింట్లో బల్లి పడగానే ర్య్‌మని పరుగెత్తి తూర్పుబజారులోని శంకరాచారి అనే బత్తుణ్ణి ముట్టుకుని వచ్చేవాళ్ళం. (మా రెండో తమ్ముడికి మాత్రం తగాదా లంటే సరదా. అందుకోసం శిరస్సుపై, బల్లిపడినప్పుడు ఎవ్వరికీ చెప్పకుండా. శంకరాచారి దగ్గరకు పోకుండా, వుండిపోయేవాడు తగాదా కోసం ఎదురుచూస్తూ.)

ఈ శంకరాచారియే మూడేళ్ళ పిల్లవాడుగా వున్నప్పుడు కంచిలో బంగారుబల్లినీ, వెండిబల్లినీ తాకించారట వాళ్ళమ్మా నాన్నా. అదీ అతని గిరాకీ. అతన్ని మేము తాకితేచాలు బల్లి ప్రభావం క్యాన్సల్. కంచిలో బల్లిని తాకినందున వచ్చిన కరెంటు అతడు బ్రతికి వున్నన్నాళ్ళూ అతని నరాల్లో ప్రవహిస్తుంటే, మేము అతణ్ణి ఎప్పుడు ముట్టుకుంటే అప్పుడు ఆ కరెంటు మాలోకి ప్రవహిస్తుంది, బల్లి ప్రభావం నశిస్తుంది.

ఈ బల్లి శకునం నన్ను పీడించినంతగా భూలోకంలో మరెవ్వరినీ పీడించి వుండదు. నేనీవూరు వచ్చిన కొత్తలో యెప్పు డయినా నామీద బల్లిపడితే గొప్ప అంతర్జాతీయ సమస్య నెత్తిన పడ్డట్టై! కంచికి ఎవ్వరు పోయినారో, ఎవరుపోలేదో యింతవూర్లో ఏమొగం పెట్టుకుని అందర్నీ అయ్యా, అమ్మా, మీరుపోయినారా కంచికి, మీరుపోయినారా....అని అడగను? ఇక్కడ్నుంచీ మా వూరికేపోయి ఆచారిని తాకివద్దామా, లేక కంచికేపోయి ఆబంగారు బల్లిని- తాకివద్దామా అని విచికిత్సలో పడేవాణ్ణి!

చివరకు ఒక శుభముహూర్తాన నేనూ కంచికిపోయి వరద రాజస్వామి గుళ్ళో వుండే ఆ బల్లులను సేవించుకుని వచ్చాను. ఇప్పుడిక బల్లివల్ల నాకేభయమూలేదు. ఎప్పుడయినా మీమీద బల్లి పడినా నన్ను ముట్టుకుని నాలోని సదరు కరెంటువల్ల మీరూ లాభపడవచ్చు!

అన్ని కథల్లాగే యీ కథా కంచికి పోతుంది. కాని మనం మంచినీ, మానవత్వాన్నీ వెదుక్కుంటూ ముందుకు పోవాల్సిన వాళ్ళంకదా. ఇక్కడొక్క క్షణం ఆగి, చూచి, ముందుకు సాగిపోదాం. ఈ బల్లిపడే శాస్త్రాలూ, పిల్లిదూకే పురాణాలూ ప్రయోజనాత్మకమైన, ప్రగతిశీలమైన జీవనవిధానానికి యేమైనా దోహదం చేస్తాయా?

శకునాలన్నవి ఆకాశంమీద నుంచి వూడిపడ్డాయనుకోవడానికి వీల్లేదు. అవి ఏనాడో ఏ ప్రయోజనం కోసమో సంఘంలోకి వచ్చివుంటాయి. మన పుడమి దయ్యములు వాటిని క్రోడీకరించివుంటారు. కాని వాటి ప్రయోజనం మనకిప్పుడు కన్పించదు. కాగా, అవి మనిషియొక్క శాస్త్రీయ దృక్పథానికీ, హేతువాద వైఖరికీ విరుద్ధాలు.

హేతువాదబద్ధంకాని, సాంఘిక వ్యవస్థను దేన్నీ బ్రతుకనీయరాదని వివేకానందాది విజ్ఞుల అభిప్రాయం. హేతువాద స్పర్శలేని మోక్షంవంటి అలౌకికానుభూతిని గురించి నేను చెప్పటం లేదు. సామాజిక వ్యవస్థల విషయంలో యిలాటి హేత్వాతీత వైఖరిని అవలంబించటం సమంజసంకాదని అంటున్నాను.

పూర్వులు సత్యాన్ని వ్యావహారిక సత్యమనీ పారమార్థిక సత్యమనీ రెండుకోణాల్లో వ్యక్తీకరించారు. పారమార్థిక వ్యవస్థకు

మూలస్థంభం వ్యష్టి. వ్యావహారిక వ్యవస్థకు మూలస్థంభం సమష్టి. మొదటిది వైయక్తికానుభవానుగతం; రెండోది సామాజికానుభవ గమ్యం; సజాతీయభావన దాని బలమూ, ఫలమూకూడా.

పారమార్థికమైన వైయక్తికానుభూతిని లోకానికి విడమ రచి చెప్పాల్సిన బాధ్యత- ఏ వ్యక్తికీ లేదు. సమాజం అలా కాదు, ఇంద్రియానుభవవేద్యమైన జగత్తుగాక మరొక స్థాయి (Plane) మానస జీవితం వున్నదనీ, అవాఙ్మానస గోచరమైన తత్త్వం వొకటివుందనీ సంఘంలో అందరూ నమ్మాల్సినపనిలేదు, బాధ్యతలేదు.

ఎరుక Knowledge వేరు; విశ్వాసం Belief వేరు. సర్వరి ఎరుకకూ అందకుండా-కొన్ని నమ్మకాలను ఆశ్రయించుకొనివుం టూ-ఏ సాంఘిక వ్యవస్థగానీ,-శాస్త్రంగాని, సిద్ధాంతంగాని-సంఘం పై పెత్తనం చెలాయించటం సరియైనపద్ధతికాదు. పురోగతికి యిది ఏమాత్రమూ తోడ్పడదు. సంఘంలో అజ్ఞేయవాదులు agnostics నాస్తికులు, భౌతికవాదులు, హేతువాదులు-, అందరూ వున్నారు. తార్కికంగా విడమరచి, హేతుబద్ధంగా విశ్లేషించి, సామాజిక ప్రయోజనాన్ని నిర్దేశించి. చెప్పలేని అనుభవాలను గుదికూర్చి ....శాస్త్రాలనీ, మతసిద్ధాంతాలనే పేర్లతో వాటికి పట్టంగట్టటం సామాజిక దృక్పథంతో చూస్తే అసమంజసం. ఈ కోణంనుంచి చూస్తే మన శకునశాస్త్రం- శౌచాశౌచప్రకరణం- ధర్మశాస్త్రం

ురుతో చలామణి అవుతున్న కొన్ని నిషేధాజ్ఞలూ, గాలికెగిరి పోతాయి. వాటి పుట్టిల్లయిన శూన్యంలోకిపోయి తలదాచు కుంటాయి.

ఇంకా సూటిగా చెబుతాను. అలౌకికానుభూతులు లౌకిక వ్యవహారాన్ని నిర్దేశించాలనే వాదం సరియైనదికాదు. దాన్ని రాస్తుంచేసే లౌకికానుభూతులున్నప్పుడు దానికి absolute విలువ దని, అది నమ్మకాలపుట్ట అవుతుందనీ 'శాస్త్రంకాదనీ' అంటాను.

అందుకే మన బల్లిశాస్త్రిగారు శాస్త్రిబ్రువుడు మాత్రమే ... ఒకేవాస్తే శాస్త్రి మాత్రమే- అవుతాడు. బల్లిశాస్త్రమనే బుల్లి శాస్త్రాన్ని ఒక శాస్త్రంగా ఎన్నుకోవటంలోనే సుబ్బావధాన్లు ఫల్టీ కొట్టాడు. ఇప్పుడేం జెయ్యమంటారాయన్ని!

కొన్ని శుభశకునాలు జరుగబొయ్యే శుభాన్ని సూచించ టమూ, కొన్ని అశుభ శకునాలు నిజంగానే అశుభసూచకాలు కావటమూ నా జీవితంలోనూ జరిగింది. కాని ఏ సూచనలూ లేకుండా వచ్చే శుభాశుభాల మాటేమిటి? అలాటివి నా జీవితం లోనూ- బహుశా మీ జీవితాల్లోనూ- వేలకు వేలుంటాయి.

ఇలాగే, విదేశీయులు యీ శకునాలను పట్టించుకోకుండా ఎంత చెడ్డారని? ఇవి ఫలానా అక్షాంశ, రేఖాంశాల్లోని వాళ్ళను- మాత్రమే బాధిస్తాయా? లేక వీటిని మనమే ఏనోడో నెత్తి

కెక్కించుకుని యీ నాటికీ దించలేక మోస్తున్నామా? మీరే ఆలోచించి చెప్పండి.

అందుకే ఎంగిలి విస్తరాకులకోసం ప్రయాసపడే వాయసాల విహాయస విన్యాసాలనూ, అలతి కీటకాల వేటకై పరిగెత్తుతూ జారి మనమీదపడే బల్లులనూ ఖాతరుచెయ్యనక్కర లేదంటున్నాను.

పిల్లి దుశ్శకునము, పిల్లి దుశ్శకునము అని పిల్లలుగా వున్నప్పుడు మనం నేర్చుకుని, పిల్లి దుశ్శకునమూ, పిల్లి దుశ్శకునమూ అని మన పిల్లలకూ మనం నూరి పోస్తాము. తెల్లవారు ఝామున పరీక్షపాఠాలు చదవటానికి లేచిన పదోతరగతి అబ్బాయి అదే సమయానికి స్వంతపని ముగించుకుని పోతున్న పిల్లినో.... సొంతపనిమీద- (పీడి పరీక్షల గురించికాదు) వచ్చిన పిల్లినో హటాత్తుగా ఇంట్లో చూస్తాడు. బాబోయ్! యివ్వాళ సైన్సు పరీక్ష క్షవరం అనుకుంటాడు. అప్పట్నించి పిల్లి దుశ్శకునమూ అనే పాచిపండ్ల దాసరిపాట, నేపథ్యంలో, పరీక్షహాల్లోనూ వాడికి విన్పిస్తుంటుంది వాణ్ణి నిర్వీర్యుణ్ణి చేస్తూంది. ఇదీ మన శాస్త్ర పాండిత్యం మన పిల్లలకు చేసేమేలు!

"Fear of failure is the cause of failure" అపజయ భీతి అపజయానికి హేతుభూతం అవుతుంది. ఇది మీ అనుభవంలో లేదా? నా అనుభవంలో వుంది.... భయంకరంగా వుంది! 'పిల్లులూ' 'నల్లకుక్కలూ' నన్ను వేటాడితే ఎన్నోసార్లు భయం

గుప్పిట్లో వాడికిపోయ్యాను; అరుస్తూపోయి అ ప జ యా న్ని వా టేసుకున్నాను.

ఒక హితైషి, 'నీవు పిల్లి శకునాన్ని చూచి భయపడటమూ, పిల్లిని ద్వేషించటమూ తగదు. అంతటా దేవుడున్నాడని విశ్వసించే నీవు పిల్లి కన్పించినప్పుడంతా, మనసులోనైనా దానికి నమస్కరించు' అన్నాడు. ఇది ఎంత విలువైన సలహా! దాన్ని నేను పాటించాను. 'సర్వభూతస్థమాత్మానాం, సర్వభూతానిచాత్మని' అని విశ్వసించే హిందువు కొన్ని సాధు జంతువులను అశుభకారకాలుగా అశుభసూచకాలుగా ప రి గ ణిం చ టం విడ్డూరంగా కన్పిస్తుంది!

ఎవరికో ఎక్కడో జరిగిన అనుభవాల్ని పురస్కరించుకుని ఏర్పరచిన శకునఫలాలనూ, స్వప్నఫలాలనూ గూ ర్చి న నమ్మకాలు అసంగతమైనవని ఆంగీరసమహర్షియే చెప్పినట్లు పూజనీయులు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు నాతో అన్నారు.

గీతలో, శుభా శుభపరిత్యాగం భక్తలక్షణాల్లో ముఖ్యమైనదిగా చెప్పబడింది అలాగే జయాపజయాలను సమదృష్టితో చూడాలని చెబుతుంది. గీత. ఇంక యీ శకున శాస్త్రం-బల్లిశాస్త్రి-బ్రతక్కూడదు. మన మనస్సులోని బూజు వదలటంవల్ల నవసమాజ నిర్మాణం సులువౌతుందని నా విశ్వాసం. ముఖ్యంగా యిది పిల్లల బుర్రల్లోకి ఎక్కకుండా చూచుకోవాలి మనం.

# కొంచెం దారివదలాలి!

మన మందరమూ నవసమాజం కోసం ఎదురుచూస్తున్నాం రాబోవు ఈనవత మా'నవత'కు హారతి పడుతుందో, దా'నవత'కు నివాళి చేస్తుందో చూడాలి. దానవతలోనూ, మానవతలోనూ 'నవత' వుండటం యాదృచ్ఛికమే కావచ్చు. మార్పు రావాలి. అని అంతా హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్ కోసం ప్లాట్‌ఫాం మీద నిల్చుని ఎదురుచూసినట్లు చూస్తున్నాం నిజమే. ఏవేళ బయలుదేరి ఏ వేళకు చేరుకుంటుందో అది. మరీ మన రైళ్ళలాగే.

ఒకటి మాత్రం మనకు తెలుసు. మార్పు రైల్లోనో, విమానంలోనో రాదు అది కాలినడకనే వస్తుందని. ఒక స్వాముల వారు తన బోధనలోని గొప్పతనాన్ని చెబుతూ, 'ఏమయ్యా మనం ఢిల్లీ పోవాలనుకుంటే నడిచిగాని. కారులోగాని, ట్రెయిన్ లోగాని, విమానం మీదకాని పోవచ్చు, ఔనా! అయితే అన్నిటి కంటె విమానం మీదపోతే ముందుగా ఢిల్లీ చేరుకుంటాం. అలాగే దైవాన్ని చేరుకోవటానికి అనేకానేక మార్గాలున్నాయి. అందులో నేను బోధించే మార్గం వుంది చూశారూ, అది 'విమాన మార్గం అనుకోండి' అని చెప్పేవాడు. ఈ విషయం జ్ఞప్తికి వచ్చినప్పు

దల్లా శ్రీరామకృష్ణ పరమహంస అన్న మాటలు నాకు గుర్తొస్తా యి. 'దైవ సాక్షాత్కారానికి సులభ మార్గాలనేవి లేవు. దాని మూల్యం దానికి చెల్లిస్తేనే అది లభిస్తుంది అనేవారు ఆయన. ఈ అడ్డదారులను వెదుక్కుంటూ, ష్లేన్ కోసం కాచుక్కూచుని, అలసి, అలాగే కునికేస్తారు కొందరు సాధకులు. ఇంతలోనే బ్రతుకు తెల్లారి పోతుంది, పాపం, వాళ్ళకు. కొందరు రాజకీయ స్వాములు ఏమి శెలవిచ్చినప్పటికీ సామాజిక అభ్యు దయ సాధనకు Short cuts లేవేమో అనిపిస్తుంది. ఈ ప్రయా ణం చాలా దూరం; ఎక్కడో ఒకచోట అది మొదలు కావాలి. దాని మూల్యమూ దానికి చెల్లించాల్సి వుంటుంది.

ఈ వ్యవస్థ బాగులేదు. దీన్నిలా సంజీవి తాకించి, అమృ తం తాగించి, బ్రతికించటం తప్పు అని మనం అనుకుంటే వెంటనే మనం మరోబాటకు మళ్ళాలి. దైనందిన జీవితములో - తెల్లవారి బట్టలు వేసుకొని బజారుకొచ్చాక—మనం ఆ మార్పు కోసం. సువ్యవస్థితస్థితికోసం, పాటుపడాలి. అంతేగాని నేనూ మార్పుకావా లనే వాడినే అంటే ఒరిగేదేముంది? సమాజంలో మార్పు కావా లనుకుంటే. ముఖ్యంగా, సమాజ జీవనాన్ని ప్రభావితం చేయగల భావాలు ప్రచురంగా, నేలనాల్గు చెరగులా ప్రచారం కావాలి. ఇది జరక్కుండా మార్పు. మార్పు అంటూ కంఠశోషపడితే మాత్రం ఆ మార్పు వస్తుందా? భావ విప్లవం రాకుండా. సామాజిక చైత న్యాన్ని కదలించే వేదన కనిపించకుండా, రోదన వినిపించకుండా

కనను కళ్లూ, వినను చెవులూ వున్న మనుషులు-చైతన్యవంతులై ప్రగతికాములైన మనుషులు-సంఘంలో లేకుండా, యీ నవసమాజం ఆవిర్భవించదు.

ఆవిర్భావం అంటే గుర్తొస్తుంది. శ్రీరాముడు కౌసల్య కడుపున పుట్టినా ఆ తల్లి ప్రసవవేదన ఎరుగదట- ఆయన ఆమెకు మనలా జన్మించలేదు, ఆవిర్భవించాడట. అంటే తల్లికి, కేకలూ-కన్నీళ్ళు లేకనే యీ అబ్బాయి-రాముడు-పుట్టాడు. కాని మనం అందరం కోరే మార్పు యిలా ఎన్నటికీ ఆవిర్భవించదు; ఆకాశంలోనుంచి వూడిపడదు. చైతన్యవంతులైన యువకులేగాక, ప్రగతికాములూ పురోగమనశీలురూ అయిన అన్ని వయస్సుల్లోనూ వున్న మేధావి 'యువకులు' యీ మార్పు మహారథాన్ని తలా ఒక చెయ్యివేసి ముందుకు లాగాలి.

నేటి మేధావుల్లో సామాజిక దృష్టి వుందో లేదో అనేలా అస్తి నాస్తి విచికిత్స కల్గిస్తూవుంది. సొంతబుర్ర అంటూ వున్నవాడల్లా దాన్ని తిన్ననాపొట్టకు శ్రీరామరక్ష అని సొంత బొజ్జకు వాడుకుంటున్నాడు, ఏ అయ్యవారిపనో, ఆచార్యపీఠమో, ప్రభుత్వోద్యోగమో-మరొకటో, సంపాదించుకుని, నింపాదిగా పొట్ట నింపుకుంటున్నాడు నేటి మేధావి. సంఘంలో అంతస్తు కోసం ఆతురతపడి పోతున్నాడు. ఏ ఫోరమో, స్టడీ సర్కిలో అని పేరు పెట్టుకుని వూరేగినా అక్కడా రాజకీయాలే

పెద్దపీటవేసుక్కూర్చుంటున్నాయి. వేలాది సామాజిక సమస్య లకు రాజకీయ వాదులు మాత్రమే పరిష్కారం కనుక్కోలేరు అంటుంది చరిత్ర. రాజకీయాలనేవి సంఘంలో మార్పుకు పనికి రావనికాదు. ఆర్థికంగా సంఘాన్ని పరివర్తనం చేయటం బహుశా రాజకీయాలు మాత్రమే చేయగలపని. కాని, సమాజంలో సంస్క రణను తేవడానికి రాజకీయవాదులు మాత్రమే చాలరేమో? రాజ కీయ జీవితంలో మనిషి ఎలా అడుసులో కూరుకపోతున్నాడో, "పదవి" అనే రంభను పరిరంభం చేసుకునేందుకు ఎలా విరహంలో కొట్టుకుంటున్నాడో ఒకసారి ఆ 'రంభ'ను అనుభవించటం ఆరం భించాక దాన్ని వదల్లేక నానాగడ్డి కరచి విడాకుల్లేకుండా చూచు కుంటున్నాడో చూస్తూ-చూస్తూ- ఈ రాజకీయాలతోనే- యీ రాజ కీయవాదులే- సమాజాభ్యుదయానికి క్రొత్తపాదులు తవ్వి, క్రొత్త అంట్లుత్రొక్కి- క్రొత్తపంట్లుకాయిస్తారని అనుకోలేక్మి. గవర్న మెంటు వుద్యోగంలో ఓతమాషా-నిజంగా తమాషాయేవుంది. ఒక ఉన్నతాధికారి తమ క్రింది వుద్యోగుల పనిమీద ప్రవర్తన మీద రహస్య నివేదికలు Confidential Reports వ్రాసి పైకి పంపు తారు. తరచుగా యీ Confidential Reports వ్రాసే అధికార్ల ప్రవర్తనే అధ్వాన్నంగా వుంటుంది ఆయన యిచ్చే ఆ రిపోర్టు అధ్వాన్న సౌందర్యంతో విరాజిల్లుతుంటుంది. రాజకీయ వాదులు సంఘసంస్కరణకోసం పడేపాట్లలోనూ ఇదే సౌందర్యం వుంది.

రాజకీయవాదుల్లో మేధావులున్నారు. మేధావుల్లో రాజకీయవాదులున్నారు. ఆట్లాటి పెద్దలు వాళ్ళ గద్దెలు వాళ్ళు భద్రపరచుకుని, నలుగురి నాలుకలమీద వున్నారు. వారినిగూర్చి ప్రత్యేకంగా చెప్పేదేమీలేదు. కాని ఏ రాజకీయాల జోలికి పోకుండా- ఏ యిజాల కౌగిట్లోనూ నలక్కుండా స్వస్థంగావున్న పెద్దలెవరైనా వుంటే- పిన్నలైనా ఎవరైనా వుంటే— వాళ్ళు వానపాముల్లా నమ్రంగా వుండి పోతున్నారేమో, యీ దేశంలో. వీళ్ళు నిజంగా నమ్రతవల్ల కలుగులోంచి వెలుగులోకి రారో, లేక లేచి నిలబడి చెప్పదల్చింది చెప్పేసే సామర్థ్యం కొరవడిందో—అసలు సమాజం పట్ల వీళ్ళకు బాధ్యత ఒకటున్నదన్న ఎరుకే లేదో? ఇవన్నీ ప్రశ్నలే. మరి ఏవి జవాబులు?

మేథ్యూ ఆర్నాల్డ్ Sweetness and light మధురిమ: మహస్సు అనే వ్యాసంలో భావనా స్వాతంత్ర్య లేక భావదాస్య విముక్తి Intellectual liberation గురించి చెబుతారు.

భావదాస్యానికో చక్కని చిన్న ఉదాహరణ మీకు చెబుతాను. మా ఆవిడ పుట్టింటికి పోయివుంది నేను తీసుకురావటానికి వెళ్ళాను. ప్రయాణానికి సిద్ధమై మావూరికి బయలుదేరుతున్నాం. మా ఆవిడ బామ్మగారు సాక్షాత్తు వాళ్ళింటి Supreme Court 'యీవేళ బయల్దేరకూడదు వూరుకోండి, రేపు పోవచ్చు' అన్నది. ఆమె అలాగే అంటూవుంటుంది. ఎందుకమ్మా అని ఖర్మ గా లి

మనం అడిగినా 'మీకు తెలీదూ అంటే వినరేం. కూడదన్నాను అంతే' అని వూరుకుంటుంది. ఆ బామ్మగారంటే మా ఆవిడకు ప్రాణం. బామ్మగారి తర్కంవుందే అదంటే నాకు ప్రాణాంతకం. మీకు తెలీదన్నాను కదా అంటే ఒహో మాకు తెలీదు కామోసు అనుకుంటూ మేము వూరుకోవటం మామూలుగా జరిగేది. ఇలా ఎన్నోసార్లు. ఈసారి మాత్రం నా పని తొందరవల్ల బామ్మగారి ఆజ్ఞకు వ్యతిరేకంగా-మా ఆవిడకు ఇష్టంలేకున్నా-యిద్దరం బయల్దేరాం రైలు టైముకు రావడమనే శుభశకునం దగ్గర్నుంచీ, సామాన్లన్నీ క్షేమంగా కొంప చేరేదాకా అన్నీ శుభంగానే జరిగాయి. ఆ వచ్చిన ఏడో నెల్లోనే మా ఆవిడను పురిటికని అత్తారింటికి తీసుకెళ్ళారుకూడా!

అప్పుడు తెలిసింది బామ్మ నీకు తెలియదంటే'నేను నాకు తెలియదు కాబోలని అనుకోవటం నిజంగా తెలియని తనమే కాకుండా తెలివిమాలినతనంకూడా అని.

భావదాస్యమనేది బామ్మగారి కయినా భగవద్గీత కయినా ఒకటే. అంటే, భగవద్గీతా, బామ్మగారూ ఒకే ప్రామాణికతలో వున్నారనికాదు. అనూచానంగా వస్తున్న విలువల్ని సమకాలీన సమాజానికి ప్రయోజనకరంగా అన్వయించేటట్లు వ్యాఖ్యానించుకోవటం ఎంతో ముఖ్యమైన కర్తవ్యం. ఇలా వ్యాఖ్యానించిన మను

షులనే Intellectual liberatorsగా సమాజం గుర్తించి గౌరవిస్తుం దంటాడు ఆర్నాల్డ్.

మచ్చుకి, భగవద్గీతలోని యజ్ఞం పదానికి పని-స్వధర్మం- అని అర్థం చెప్పారు స్వామి వివేకానంద. ఆఫీసుల్లోనూ, ఫ్యాక్టరీల్లోనూ, పొలాల్లోనూ మనిషి నిర్వర్తించే స్వధర్మ విహితమైన కర్మను యజ్ఞం అన్నారాయన. ''work is worship'' పనీ పూజా ఒకటే అన్నారు. యజ్ఞమంటే అగ్ని, సమిధలూ, ఋత్విజులూ, మనకు గుర్తుకువస్తే- వాటినుంచి మనం పారిపోతాం అని స్వామీజీకి తెలుసు. మారుతున్న సంఘానికి చేరుతున్న విలువలకు స్థానం కల్పిస్తూ శాశ్వతమైన సత్యాలకు మనం క్రొత్త వ్యాఖ్యానంచెప్పుకోవాలి. పాత సూత్రాలకు క్రొత్త భాష్యాలు వ్రాసుకోవాలి. ఇదే మేధావులకర్తవ్యం. గాంధీజీకూడా ఈకర్తవ్యాన్ని గొప్పగా నిర్వర్తించారు. ఆయన కేవలం నిరాహార దీక్షలుచేస్తూ కూర్చుంటే ఏదో ఒక నిరాహార దీక్షలో మరో లో క ం లో కళ్ళుతెరిచివుండే వారే. కాని భారతీయుల జీవనాడుల్లో జీర్ణించుకుపోయిన ఆధ్యాత్మిక విలువలను చేరువకోణంనుంచి దర్శించి మన జనతకు మారు మనసు కల్గించారు. సత్యాగ్రహాన్ని, సహాయ నిరాకరణోద్యమాన్ని, అస్పృశ్యతా నిరోధాన్ని బాపూజీ రూపొందించటం పాత ఆధ్యాత్మిక విలువలకు కొత్త రూపాన్ని తాపించటమే. భయం భయంగానేను ఆ ప్రవక్త ప్రమేయంలేని స్వాతంత్ర్య సమరాన్ని వూహించినప్పుడు అనాటికిరాతక శ్వేతముఖులు భారతదేశచరిత్రను

విన్నటి బంగ్లాదేశ్ చరిత్రకు మళ్లీనే కన్నీటి జడిలో నూ, నెత్తుటి వరదలోనూ ముంచి వేసేవారేమో అనిపిస్తుంది. ఎందరో అభిమన్యులను, అశ్వత్థాములను సమరోత్సాహం నుంచి నిరోధించి సరికొత్త భారత యితిహాసం సృజించారు. బాపూజీ సత్యకాముడు. తన సత్యాన్వేషణకు అంగభూతమైనవే ఆయన మహోద్యమాలు. అలా అని ఆయనే చెప్పారు. రాజకీయ దాస్యం నుంచేకాక, భావ దాస్యం నుంచి కూడా మనజాతి విముక్తం కావాలని ఆశించారు. అందుకే గాంధీజీ జాతిపితయేకాక జాతిగురువు Mentor of the nation కూడా. కేవలం రాజకీయ నాయకుడుగా అస్థానం అయనకు దక్కేదికాదు,

దానవతను సమాధిచేసి మానవతకు పునాదివేసే నవత సమాజంలో ప్రతిష్ఠింపబడాలంటే రాజకీయవాదులు గానట్టి మేధావులు కళ్ళు నులుపుకుని లేచిరావాలి. రాజకీయ వాదులు వాళ్ళకు కొంచెం దారి వదలాలి.

# శ్రీ శారదా దేవి

కలకత్తాకు నాల్గుమైళ్ళలో దక్షిణేశ్వర కాళికాలయం వుంది. అక్కడ ఆరాధింపబడే దేవిని భవతారిణీకాళి అంటారు. ఆమెకు పూజారి శ్రీరామకృష్ణ పరమహంస ఆయన భార్య శారదాదేవి. వాళ్ళిద్దరి పవిత్ర దాంపత్యం గురించి మీరు విన్నారు. కాని మళ్ళీ మళ్ళీ వినాలనిపించే సంఘటనలు అందులో కొన్ని వున్నాయి.

శ్రీరామకృష్ణుని బాల్యనామం గదాధర చటర్జీ. ఆయనది పశ్చిమ బెంగాల్‌లోని బంకూరాజిల్లాలో కమార్‌పుకూర్ అనే ఒక చిన్న వూరు. శారదాదేవిది ఆ వూరికి చాలా దగ్గరలో- అంటే ఐదారు మైళ్ళ దూరంలో వుండే జయరాంబటి అనే మరో చిన్న వూరు. ఆమెకూ ఒక తొలిపేరుంది. ఠాకూర్మణి అది. వాళ్ళది ముఖర్జీల వంశం. తండ్రి రామచంద్రముఖర్జి, తల్లి శ్యామాసుందరి 1853 లో శారదా జనయిత్రి జననమందింది.

ఛటోపాధ్యాయ ముఖోపాధ్యాయ అనే పేర్లను పొట్టి చేస్తే ఛటర్జీ, ముఖర్జీ అయినాయి. అవి రెండూ. బెంగాలీ

బ్రాహ్మణ కుటుంబ నామాలు, గోత్రాలూ, ఋషులూ వేరుకాబట్టి వాళ్ళకు యిచ్చి పుచ్చుకోవటాలున్నాయి. శ్రీ రామకృష్ణునిది చటర్జీల వంశం. అమ్మది ముఖర్జీల వంశం.

శ్రీ రామకృష్ణుని దివ్యోన్మత్తతకు పిచ్చి అని పేరు పెట్టింది లోకం. నూనూగు మీసాల నూత్న యౌవనంలో కొడుకు 'పిచ్చి' వాడయిపోయినాడని వాపోయింది తల్లి చంద్రావతీదేవి. పిచ్చికి విరుగుడు పెళ్ళే! అయితే లోకంలో వున్న ప్రవాదంమీకు తెలుసు పెళ్ళి కుదిరితేగాని పిచ్చి కుదరదు. పిచ్చి కుదిరితేకాని పెళ్ళి కుదరదు. పిచ్చివాడుగా చెలామణి అవుతున్న శ్రీ రామ కృష్ణునకు పిల్లనియ్య ఎవరూ ముందుకు రావటంలేదు. శ్రీ రామ కృష్ణుని అన్న రామకుమారుని చెప్పులజతలై తే అరిగిపోతున్నా యిగాని యీ పిచ్చివాడిపెళ్ళాం ఎక్కడ పుట్టిందో తెలియటంలేదు పెళ్ళికబురు తెలిస్తే వద్దంటాడేమోనని యీ ప్రయత్నాలన్నీ రహస్యంగానే వుంచారు పెద్దలు.

శ్రీ రామకృష్ణుడప్పుడు పసివాడేమీకాదు. యిరవైమూ డేళ్ళ యువకుడు, వీళ్ళ అగచాట్లన్నీ గమనిస్తూనేవున్నాడుతనూ. ఒకరోజు చంద్రావతీదేవి దగ్గరకువెళ్ళి, చిరునవ్వుతో యిలా అన్నాడట. "అమ్మా! ఎందుకీ ప్రయాసమీకు. నేను పెళ్ళికి వొప్పుకుంటున్నాను, జయరాంబటిలో రామచంద్రముఖర్జీ యింట్లో నాకోసం ఒక అమ్మాయిని మీదుకట్టి వుంచారు. ఆమెను తెచ్చి

చెయ్యండి నాకు'' అన్నాడు. ఇన్నాళ్ళూ వ్యవహారం మొండికి పడిందికదా. ఆ బ్రాహ్మణుడైనా వొప్పుకుంటాడో లేదో? రామ కృష్ణుడు దివ్యావేశంలో అన్నది నిజమోకాదో? అయినా, పోయి రామచంద్రముఖర్జీని అడిగారు. ఆయన పిల్లనియ్యటానికి వొప్పు కున్నారు. అవి యీనాటివలె వరకట్నాల రోజులుకావు శ్రీరామ కృష్ణుని పెళ్ళికి మూడువందల రూపాయల కన్యాశుల్కం. ఇం తకూ ఆ పెళ్ళికూతురు శారదకు ఆరోఏడు!

పెళ్ళి జరిగిన తర్వాత శారదాదేవి పది, పన్నెండేళ్ళపాటు పుట్టింట్లోనే వున్నది. ఒకసారి మాత్రమే-ఆమె పధ్నాలుగోఏట శ్రీ రామకృష్ణుడు అత్తగారింట ఆమెనుచూచి వెళ్ళాడు.

దక్షిణేశ్వరంలో వున్న శ్రీ రామకృష్ణునకు కాళికామాత తప్ప మరోధ్యాసలేదు. తన్నుతానే మరచిన దివ్యోన్మత్తుడు తన వాళ్ళనెలా గుర్తుంచుకొనగలడు? శ్రీరామకృష్ణునకు మరలా పిచ్చి పట్టినదని ముద్రపడింది.

ఆనోటా ఆనోటాపడి యీ 'పిచ్చి వార్త' జయరాంబటి చేరింది. భర్త శుభాగమనం కోసం ఎదురుచూస్తున్న శారదాదేవికి యీ వదంతి పిడుగుపాటు అయింది. తండ్రిని వెంటబెట్టుకొని బయలుదేరి కాలినడకన కలకత్తాచేరింది.

భర్త తన్ను ఆదరిస్తాడో, నిరాకరిస్తాడో? శ్రీ రామ కృష్ణుని మనస్సు భగవదంకితమైనదని తనకు తెలుసు. సంసార పంకిలం అంటుకుంటుందని భార్యను దూరంచేస్తే? ఇలాటి సందే హాలు వేధిస్తున్నాయి భర్తృ సముఖంలోకి ఆమె వచ్చినప్పుడు.

శ్రీరామకృష్ణుడు భార్యను ప్రియంగా పల్కరించి, కుశల ప్రశ్నలువేసి, అప్పుడు కావలసిన అన్ని ఏర్పాట్లు చేశాడు. పైగా దక్షిణేశ్వర ఆలయానికి యజమానీ, తన శిష్యుడూ అయిన. మధురబాబు మరణించి నందున ఆమెకు చేయగల అన్ని సదుపా యాలూ చేయలేకపోతున్నానని నొచ్చుకున్నాడు. శారదాదేవి భయాలు తీరిపోయినాయి.

శారదా రామకృష్ణుల దాంపత్య జీవితం ఒక పవిత్ర చరిత్ర: దివ్యలీలా తరంగిణి అది.

"నీవు నన్ను సంసారంలోకి లాగటానికి వచ్చావా" అని శ్రీ రామకృష్ణుడు ఒకరోజు ప్రశ్నించాడు. "లేదు, మీ అధ్యా త్మిక జీవనానికి తోడ్పడ్డానికే వచ్చాను" అన్నది శారదాదేవి.

భర్త కాళ్ళు పిసుకుతూ కూర్చునివుంది శారదాదేవి. ఏమి స్ఫురించిందో ఆమెకు, మీరు నన్నెలాచూస్తారు? అని అడిగింది. శ్రీ రామకృష్ణుడు వెంటనే "ఏ తల్లి ఆలయంలో పూజలందు

కుంటున్నదో, ఏతల్లి నహబత్‌గది (తల్లి చంద్రావతీదేవిగది) లో వున్నదో, ఆ తల్లుల వలెనే నిన్నూ గౌరవిస్తాను" అన్నాడు.

నిజంగానే శ్రీరామకృష్ణుడు ఒకనాడు శారదాదేవికి - కన్యలకు మాత్రమే చేయదగు-షోడశీపూజ అనే పూజను చేశాడు. పైగా తన తపః ఫలాన్నంతటినీ ఆమెకు ధారపోసి జపమాలను ఆమె పాదాల ముందుంచి, సాగిలపడి నమస్కరించాడు. ఆ సమయంలో మాతృశ్రీ కేవల దివ్యత్వము మూర్తీభవించినట్లు కూర్చునివుంది.

భర్తకు శారదాదేవిపట్ల ఎనలేని గౌరవము. ఆమెను ఎప్పుడూ తుస్కారంగా 'నీవు' (బెంగాలీ భాషలో తుయి) అని కూడా పిలిచి ఎరుగడు. ఆమెను సరస్వతి అనీ, రాధ అనీ, ప్రస్తుతించి దేవతలతో సమానంగా గౌరవించాడు.

పారలౌకికంగా ఆమె దివ్యత్వాన్ని గ్రహించి నప్పటికీ, శ్రీ రామకృష్ణుడు లోకరీతిగా ఆమెకు మంత్రదీక్షనిచ్చి, గురువైనాడు. శారదాదేవి భర్తను గురువుగానేగాక, కాళికాదేవి రూపంగా గుర్తించి గౌరవించింది. శ్రీ రామకృష్ణుడు మహాసమాధి నందినప్పుడు ఆమె 'అమ్మా నన్ను విడిచి వెళ్ళిపోయావా', అని వాపోయింది. భర్తను దివ్య మాతృభావన చేసిన పవిత్రతా స్వరూపిణి శారదాదేవి.

కాపురానికి వచ్చిన తొలిరోజుల్లో- మొదటి ఎనిమిదినెలలు శారదా రామకృష్ణులు ఒకే శయ్యపై నిద్రించేవారు. శ్రీ రామ కృష్ణుడు కారణ జన్ముడు. గృహస్థుగా బ్రహ్మచర్య జీవనం గడిపిన లోకాతీతవ్యక్తి. ఒకరోజు తన మనస్సును ఇలా సంబోధించుకున్నాడట 'ఓ మనసా, ఇదుగో, యీ ప్రక్కనున్నది నా భార్య శరీరమే; దీన్ని అనుభవించటానికి సర్వహక్కులూ నాకున్నాయి శారీరకమైన ఆనందం కావాలో లేక అలౌకికమైన దివ్యానందం కావాలో, కోరుకో'.

ఈ భావన తన మనస్సులోకి రావటంతోటే ఆయన సమాధిగతుడై బాహ్యస్పృహను కోల్పోయినాడు. కాళీమాత శ్రీ రామకృష్ణుని 'భావముఖావస్థ'లో వుండమని దీవించింది. లౌకికము-పారలౌకికము రెండు గదులు అనుకుంటే వాటి మధ్యనుండే గడపమీద నిల్చొనివున్నవాడు భావముఖావస్థలో వున్నట్లు. ఆయనకు సమాధి – అతీంద్రియస్థితి – మంచినీటిప్రాయం. శ్రీ రామ కృష్ణుడు ఏదో మిషతో రోజుకు ఎన్నోసార్లు సమాధిలోకి వెళ్ళేవాడు. రాత్రిళ్ల అంతే. ఏ మంత్రాలు చదివితే – ఏ నామాన్ని ఉచ్చరిస్తే - తను మరలా మామూలు స్పృహలోకి వచ్చేదీ భార్యకు చెప్పాడు. ఆమె పగలు ఎవరికంటా పడకున్నా తనతో శయనించిన ఆ ఎనిమిది నెలలూ రోజూ ఆ మహాత్ముని సమాధి స్థితి నుంచి బాహ్యస్మృతికి తీసుకుని రావటంలో ఎక్కువ ప్రొద్దు మేల్కొవటం జరిగింది. తర్వాత ఆమె ఆరోగ్యం దెబ్బతినటం

వల్ల శ్రీ రామకృష్ణుని తల్లి చంద్రావతీదేవితో నహబతు గదిలోనే పడుకునే ఏర్పాటు చేశారు.

భార్యా భర్తలు విరాగులై సహజీవనం చేసిన వింతనాటకం దక్షిణేశ్వరంలో ప్రదర్శితమైందని విన్నాం. శారదా రామకృష్ణులు యుగవతారమూర్తులనీ శారదాదేవి పవిత్రతామూర్తి అనీ లోకం ఇప్పుడు ఎరుగును. విశ్వవిఖ్యాతమైన శ్రీరామకృష్ణ మఠాలలోనూ సేవా సంస్థలలోనూ వారినే ఆరాధ్య దైవాలుగా పూజిస్తున్నారు. మరి ఆనాటి సంగతి ఒకటి చెబుతాను. అస్ఖలిత బ్రహ్మచర్యం గురించి ఎన్ని కబుర్లు చెప్పినా వయసులోవున్న భార్యను నిర్లక్ష్యం చేయటం సాధ్యమా అని ఆనాడు ఎంతోమంది సందేహించేవాళ్లు. అందులో ఒక కుఱ్ఱవాడు మాత్రం రామకృష్ణుని గదినుండి శారదా దేవి శయనించే నహబత్‌గదికి పోయే దారిలో ఎన్నో రాత్రులు జాగారంచేస్తూ కాపలాకాసేవాడు. ఎందుకు? శ్రీ రామకృష్ణుడు ఏ అర్ధరాత్రి వేళనో నహబతుగదికి వెళ్తాడేమో తనుచెప్పేదీ చేసేదీ వేరేమో? ఇలా నిద్రాభంగంచేసుకున్న కుఱ్ఱవాడు ఎవరనుకున్నారు? నరేంద్రనాథుడు. అంటే సాక్షాత్తూ విశ్వవిఖ్యాత సన్యాసి వివేకానందుడే.

మరి యీ సంగతులు మనకెలా తెలుసు? నరేంద్రుడే పశ్చాత్తప్తుడై తన సహచరులతో గురువును తను ఎంతగా శంకిం చిందీ చెబుతూ 'అంతటి మహాత్మునే నేను శంకించాను' అని దుఃఖించాడు.

వివేకానందుడే మాతృశ్రీని She is the last word in ideal Indian womanhood. అని ప్రస్తుతించారు. ఆమె ఆజ్ఞను ఆశీస్సును అందుకునిగాని అమెరికాకు బయలుదేరలేదు! ఆమెను మేరీమాతగా భావించించి, సిస్టర్ నివేదిత.

పవిత్రం చరితం యస్యాః
పవిత్రం జీవనం తథాః
పవిత్రతా స్వరూపిణ్యై
తస్యై కుర్మో నమోనమః-

అని స్తుతించాడు అభేదానందస్వామి

వేలకొలది శిష్యులకూ, భక్తులకూ, అమ్మ యీనాటికీ వుంది. 1920 సం లో స్థూలశరీరాన్ని విడిచి చిద్ఘన రూపాన్ని ధరించినప్పటి నుంచీ ఆమె అభయహస్తం అందరికీ చేరువైంది. శారదాకుమార్ పునర్జన్మ ఎత్తింది యీ చల్లని తల్లి 'అమృత' గర్భంనుండే

# జీవితాదర్శము - వివేకానందుడు

మనం ఎందుకోసం బ్రతకాలి? ఈ ప్రశ్న అందరికీ ఒకటే అయినప్పటికీ దీనికి జవాబు తలకొక రీతిగా వుంటుంది. ఎవరి ఆదర్శాలు వారివి! అయితే కొందరు ఏ ఆదర్శమూ లేకుండా బ్రతుకు తెల్లవార్చుకుంటారుగూడా.

ఒక ఆదర్శం అంటూ వున్నవాడు నూరు తప్పులు చేస్తే, ఏ ఆదర్శమూ లేనివాడు వెయ్యి తప్పులు చేస్తాడు అన్నారు, వివేకానందస్వామి. అంటే ఏదో ఒక ఆదర్శం మనిషన్నవాడికి వుండాలని.

స్వామీజీకి ప్రీతిపాత్రమైన జీవితాదర్శం ఏమిటో మీకు తెలుసుకోవాలని వుందిగదూ. అదే చెబుతున్నాను. విశ్వవిఖ్యాత రామకృష్ణ మిషన్‌వారికీ, ఆయన ప్రత్యక్ష శిష్యులకూ, లోకానికంతటికీగూడా, ఆయన సిఫార్సుచేసిన ఆదర్శం "ఆత్మనో మోక్షార్థం—జగద్ధితాయచ," అన్నది.

మనిషి ఎందుకోసం బ్రతకాలి? "తన ముక్తికోసం-ఎదుటి మేలుకోసం" ఇదీ వివేకానందుని సూటి జవాబు. నేటికీ ఏనాటికీ రామకృష్ణన్‌వారి ఆదర్శం యిదే.

"Go to hell to buy salvation for others" అన్న సుధామయసూక్తి కూడా వివేకానందునిదే. ఇతరులకు ముక్తిని సాధించడంకోసం నీవు నరకానికైనా వెళ్ళు మన్న పరమ కృపాళువు ఆయన. ఈవాక్యం రసాత్మకమైన కావ్యంగా, ఆయన ఋషియైన మహాకవిగా నాకు కన్పిస్తాడు! 'నా దేశంలో ఒక కుక్క ఆయినా పస్తుపడి వున్నంతవరకు దానికి ఆహారం పెట్టడమే నా ధర్మము. అదే నా మతము. మిగిలినదంతా అధర్మమూ, కృత్రిమ ధర్మమూ' అన్నది ఎవరో మీకు తెలుసుగదా! స్వామీజీ హృదయం దివ్యకవితావేశ నిలయం.

ఒక సందర్భంలో.... "మరి నా శిష్యులమని చెప్పుకుంటూ తిరిగే మీరు చేసిన పుణ్యకార్యం ఏమిటో చెప్పండి. లోకహితం కోసం ఒక్క జీవితాన్నైనా అర్పించగలిగారా? వేదాంత శ్రవణాన్ని ధ్యానాదిసాధనలనూ, ముందు జన్మానికి వాయిదా వేసుకుని; ప్రస్తుతంవున్న దేహాన్ని లోకసేవకోసం ఆహుతిచెయ్యండి" అని నిష్ఠూరంగా అన్నారు స్వామీజీ తన శిష్యులతో.

"తీవ్ర తపస్సుచేసి నేను కనిపెట్టిన మహత్తర సత్యం యిదే 'ప్రతిజీవిలోనూ భగవంతుడున్నాడు' దృశ్యమానమైన యీ సమస్త జీవకోటికూడా అతని స్వరూపమే. భగవంతుడు ఎక్కడవున్నాడని పోయివెతుకుతారు? ఎవడు జీవారాధకుడో వాడే దైవారాధకుడు!" అనికూడా అన్నారు ఆయన.

ఒకానొక కొమ్ములుతిరిగిన పండితుడు వివేకానంస్వామితో వేదాంత రహస్యాలను చర్చించటానికి వచ్చాడట. ఇది 83 ఏళ్ళ నాటి మాట అప్పుడు బెంగాల్లో ప్లేగు వ్యాధి వ్యాపించివుంది. స్వామీజీ ఆయనతో యిలా అన్నారు: "అన్నమో రామచంద్రా అని జనం అల్లాడిపోతుంటే వాళ్ళ కడుపుమంట చల్లార్చటం మీ మొదటి కర్తవ్యం. ఆ పని చూచుకుని ఆ తర్వాత ఏ వేదాంత చర్చకైన నాదగ్గరకు రాండి. కూడు లేకుండా చచ్చే వేలకొలది జనాన్ని రక్షించటం కోసం ప్రాణాలను ధారపోయటమే వేదాంత తత్వసారం." పాపం ఆ పండితుడు వచ్చినదారినే వెళ్ళివుంటాడు. ఎందుకంటే ఆయన వేదాంతాన్ని చర్చించటానికి సిద్ధమేగాని ఆచరించటానికి తయారుగాలేడుగదా!

ఒకసారి సోదర శిష్యులతో స్వామి యిలా అన్నారు: "శ్రీరామకృష్ణుని శిష్యులమైన మనం ఆత్మమోక్షం కోసం ప్రాకులాడటం చాలా శోచనీయమైన విషయం. 'ఒక్క ప్రాణికయినా సాయం చేయగల్గితే వెయ్యి జన్మలు కుక్కగా పుట్టడానికైనా సంసిద్ధంగా వున్నాను' అన్నవారు మన గురుదేవుడు. భారతదేశంలో నూతన సన్న్యాస సంప్రదాయాన్ని స్థాపించటమే నా జీవితధ్యేయం జన సామాన్యాన్ని వుద్ధరించటానికి తమ జీవితాలను ధారపోయటమే యీసన్యాసుల ఆదర్శం" కాషాయ కోకలుకట్టుకుని సంచరపడుతున్న మన స్వాములవార్లకు యీ ఆదర్శం ఎంతవరకు చెల్లుతుందో వాళ్ళే చెప్పాలి!

తన శిష్యులతోనూ, సోదర శిష్యులతోనూ, పండితుల తోనూ గాక, తమ సందేహాలు తీర్చుకోవచ్చిన యువకులతోగూడా స్వామీజీ యిలాగే చెప్పేవారు. "స్వామీజీ. యిప్పటికీ నా గది తలుపులు బిగించి, కన్నులు మూసుకుని ప్రతిరోజూ ధ్యానం చేసుకుంటూనే వున్నాను. కాని శాంతి దొరకటంలేదు. తామేదైనా దారి చూపగలరా?" అని అడిగాడు ఒక యువకుడు.

"అబ్బాయీ నా మాటలు నీవు లక్ష్య పెట్టేటట్లుంటే మొదట నీవు నీ గది తలుపులు తెరచి, మూసుకున్న కళ్ళు విప్పి నీ చుట్టుపట్ల వున్న పరిస్థితులను గమనించు. నీ యిరుగు పొరుగున వందలకొలది దీనులూ, నిస్సహాయులూ, పడివున్నారు. నీ శక్తికొలది వారిని సంరక్షించు. రోగులకు మందిచ్చి సేవించు. ఆకలితో అల్లాడేవారికి అన్నంపెట్టు. చదువులేనివాళ్ళకు నీకు తెలిసిన చదువుచెప్పు. మనశ్శాంతికి యిదే మార్గం" అని సలహా యిచ్చారు పాపం, వాళ్ళు కదలకుండానే మోక్ష సామ్రాజ్యాన్ని అరచేతి అమలకంగా దక్కించుక పోదామని స్వామివద్దకు వచ్చిన ఆ కుఱ్ఱవాడు నిస్పృహతో తిరిగివెళ్ళాడట!

స్వామీజీ మాటలను యింత విస్తృతంగా వుల్లేఖించటంలో నా ఉద్దేశ్యం వొక్కటే "తన ముక్తికోసం - ఎదుటి మేలుకోసం" అన్న ఆదర్శాన్ని స్వామిజీ పాటించటంలోనూ, లోకానికి చాటించటంలోనూ ఒక ముఖ్యమైన 'మార్పు' చేశారని చెప్పడమే.

'ఎదుటిమేలు' ప్రస్తావన వచ్చినప్పుడు 'తనముక్తి' అన్నది తప్పని సరిగా వెనకసీట్లోకివెళ్ళి కూర్చోవాలి. ''ముందు లోకహితం, ఆ తర్వాత, తన మోక్షం''—ఇదీ 'ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయచ' అన్న వైదికాదర్శంలో స్వామీజీ తెచ్చిన 'మార్పు'.

నిజానికి అది మార్పు అని చెప్పడానికిగాని, క్రమాన్ని తప్పించడం అని అనడానికిగాని వీల్లేదు. తన మోక్షం కోసం, మరియు, జగత్ హితం కోసం- అన్నవి జంట ఆదర్శాలుగా మనకు ప్రదర్శించారు పెద్దలు. వాటి రెంటినీ గుదిగూర్చి. వాటి మధ్య సాధ్య సాధక భావాన్ని ప్రతిష్ఠించి, స్వామీజీ యీ సనాతన ఆదర్శాలకు ఒక గంభీరమైన, మనోజ్ఞమైన. మౌలికమైన, వినూత్నమైన, ప్రయోజనాత్మకమైన, భాష్యాన్నిచెప్పి. ఎదుటిమేలుకు పాటుపడటంద్వారా తన ముక్తిని సాధించుకోవాలి' అని సిద్ధాంతీకరించారు. జగద్ధితం కోసంచేసే ప్రతిపనీ ఆత్మ మోక్షం కోసం చేసే పూజవంటిదే- Work is worship అన్నారు స్వామీజీ· ఇలా అభ్యుదయ నిశ్శ్రేయసాలకు ఏక ముఖత్వాన్ని సంతరించారాయన. 'వైయక్తిక ముక్తికి సమకాలీన సమాజాన్ని సేవాభావంతో వుద్ధరించ ప్రయత్నించటమే చక్కని సాధన' అన్న స్వామీజీ విప్లవాత్మకమైన ఆలోచన మన రుద్రాక్ష పిల్లులకు ఎదుర్కోలేని సవాలుగా మిగిలింది.

స్వామీజీ అడుగుజాడల్లో ముందుకు నడిచి వెళ్ళదలచిన యువకులు తమ నవనాడులనూ నిర్వీర్యంచేసిన శుష్క వేదాంతి వితంతు ముఠానూ-వాళ్ళ పోకడలనూ-CIA గూఢచారి కార్యకలాపాలకంటే అతిజాగ్రత్తగా గమనించాలి. 'ధర్మం' పేరుతో మన తెలుగునాటి వ్యాపారస్తులు సామాన్య గృహస్థుల నెత్తినరుద్ది గడించే డబ్బును, ఈ శుష్క వేదాంతుల పాదపూజలకు తగలెయ్యడం మానుకుని, జనసామాన్యానికి అక్కరకొచ్చే పనులకు వినియోగం చేయగల్గితే దేవుడు వాళ్ళకు చాలా మేలు చేస్తాడు!

స్వామీజీ స్వయంగా పాటించి, సమాజానికి చాటించిన, యీ ముక్తి మార్గం భారతీయ వేదాంతోద్యమంలో ఒక మహోన్నిత వినూత్న ప్రయోగం; దారీ, గురీ, ఏకమైన కర్మయోగం. ఎంతటి రాడికల్ సోషలిస్టు అయినా దీనిపై ఏ అభియోగమూ తేలేడు! 'మానవసేవ అన్నదే నిజమైన మాధవపూజ' అన్నారు స్వామీజీ.

స్వామీజీ చెప్పిన ఈ ఆదర్శం ఎవరికైనా నచ్చుతుంది' ఎవరి హృదయాలనైనా ఆకట్టుకుంటుంది. కాని వచ్చిన చిక్కంతా యీ ఆదర్శాన్ని ఆదరించటంలో లేదు. ఆచరించటంలోనే వుంది!

మానసికంగా ఆదరించే ఆదర్శాలను మనం త్రికరణశుద్ధిగా ఆచరించగల్గినప్పుడే ఆ ఆదర్శాలు సార్థకమౌతాయి. ఇందుకు మనన శీలతా, కార్యదక్షతా, రెండూ కావాలి.

# ఒక అనుభూతి

ఆంధ్రోద్యమం పుణ్యమా అని ఆటవిడుపు దొరికిందినాకు. తిరిగే కాలూ, తిట్టే నోరూ వూరుకోవటగా. ఊళ్ళూ, గుళ్ళూ చూచుకుంటూ మనసులోని 'మంచి' పంటను నిర్వీర్యంచేసే కలుపు మొక్కలను లాగివేసుకుంటూ గడిపేశాను. మనిషి వెనకాల మన నుసు వెదుక్కుంటూ కొందరు పెద్దలను కలుసుకుని మాటామాటా కలిపివచ్చాను.

ఈ కబుర్లు మీ కాలాన్ని కాజెయ్యడానికే గాకుండా, కొన్ని విలువలపట్ల మీకున్న ఆసక్తిని మరికొంచెం రాజెయ్యడా నికిగూడా పనికొస్తాయేమో?

కలకాలంగా నాలో మిగిలిపోయిన కోరిక ఒకటి నిజ మైంది 1973 ఫిబ్రవరి 28 న. ప్రొద్దున పది గంటలలోపే, సరిగ్గా చెప్పాలంటే 9 35 కి. మైలాపూరు ఎడ్వర్డు యిలియట్స్ రోడ్డులోని స్వగృహంలో విశ్రాంతి తీసుకుంటూన్న మాజీ రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్‌గారి దర్శనం లభించింది ఆ రోజు.

కేవలం విలాసయాత్రగా నెల్లూరు నుంచి వచ్చిన ఒక మిత్రుడూ, నాతో వున్నాడు. డా॥ రాధాకృష్ణన్ కొంత కాలంగా అస్వస్థులుగా వుండటంవల్ల ఎవరితోనూ మాట్లాడటం కూడదని డాక్టర్లు చెప్పారట. అయినా, వారి తేజోమయమూర్తిని కళ్ళారా చూచిరావడమే పదివేలని అనుకున్నాను. ప్రైవేట్ సెక్రటరీ ద్వారా వారి అనుమతి లభించిన తర్వాత ఆ విశాల భవనంలో తూర్పువైపున్న ఒక చిన్నగదిలో వారిని చూచాము.

డా॥ రాధాకృష్ణన్ ఎత్తయిన తలగడకు ఆనుకుని పరుపు మీద పడుకునివున్నారు, తెల్లటిషీట్ కప్పుకుని. మేము నమస్కరించగానే చిరునవ్వుతో ప్రతినమస్కారంచేసి ఎక్కడ నుంచి వస్తున్నారు అని అడిగారు తేనె తెలుగులో. దానికి బదులుగా నా మిత్రుడు తాను ఫలానా అనీ, నెల్లూరు నుంచి వస్తున్నామనీ ఇంగ్లీషులో బదులు చెప్పాడు. ఆ తర్వాత నేనూ చెప్పుకున్నాను. వారు హాయిగా చిరునవ్వు నవ్వారుగాని నాకు మాత్రం ఏదో వెలితిగావుంది నాజవాబు. అప్పుడు స్ఫురించింది నాపొరపాటుఏమిటో. అంతటివారు- Sons of the English Soil ని సైతం ముగ్ధులను చేసే యింగ్లీషు మాట్లాడగలిగిన పెద్దలు- మా కోసం, అలవాటు లేని తెలుగు భాషలో కుశలప్రశ్న వేశారు. మేమో? గొప్పగా యింగ్లీషు మాట్లాడేశాం' అనిపించేలా మాకు సరిగ్గారాని అందతుకు ఆంగ్లంలో వారికి జవాబిచ్చాం.

తప్పులో కాలేశాను. వెంటనే తీసేసుకావాలి. ఎ
అందుకు మరో ప్రశ్న తెలుగులో అడిగాను: 'మీ ఆరోగ్యం
వుంది' అని. 'ఇలా ఉన్నాను' అన్నారు. నిసర్గరమణీయమైన
చిరునవ్వు నవ్వుతూ. 'చాలా అదృష్టం. మిమ్మల్ని కలుసుకో
టం' అంటూ భక్తితో నమస్కరించి, గదినుంచి బయ
వచ్చేశాను.

ఇక్కడ రెండు మాటలు చెప్పాలి. రాధాకృష్ణ పండి
వాడి చూపులూ, కొనదేరిన ముక్కూ నా కెంతో ప్రియమై
ఎంతో Purposeful గా వుంటుంది వారి తీరు. బహుశా 196
కాబోలు భవన్స్ జర్నల్లో ఒక ఆటోబయోగ్రాఫికల్ స
(సంక్షిప్త స్వీయకథ) చూచాను. అందులో వారు ఇలా
కున్నారు. నన్ను అందరూ మహా సంయమశాలి అనీ,
మెరుగనివాడిననీ అనుకుంటారుకాని నాకూ ఆవేశకావేశాలు
అన్నారు. Nervously organised· capable of strong emo
అన్న మాటలు నాకు గుర్తు ఎవరి మనసైనా—దాని స్వభావ
చంచలమైనదే. దాన్ని దారిలో పెట్టడానికి తగిన విలువల
హన, వాటి ఆచరణలో శ్రద్ధ యివే మనిషిని మనీషిగా,
నీయుడుగా చేయగలవు. భగవంతుడు ప్రతి జీవుని
Individual commitment కలిగి వుంటాడని అంటారు డా॥
కృష్ణన్

ప్రేమను వ్యక్తీకరించేదీ విశ్వజీవనాన్ని శాశ్వతం చేసేదీ అయిన లైంగిక క్రియ పవిత్రమైనదన్న వారి సూక్తి నన్ను గొప్పగా ఆకర్షించింది. Sex act Is a holy act అని నిర్భయంగా అన్నారు వారు.

ఆరోగ్యవంతులైన స్త్రీ పురుషులందరికీ కావలసిన ధర్మ సంస్కారం Sex. రఘువంశీయులను గురించి యౌవనే విషయైషిణాం అని కాళిదాసు చెప్పారు. ఎందుకో కొందరు శుష్కవేదాంతులు దాన్ని 'అబ్బే, ఛీ' విషయంగా మార్చివేశారు. ఋషిప్రోక్తమైన కామశాస్త్రం మనకొకటివుందని తెలిసీకూడా! "ధర్మావిరుద్ధో భూతేషుకామోస్మి' ధర్మ అవిరుద్ధమైన కామంలో దైవం వున్నాడని గీతాచార్యులూ అన్నారు, విభూతియోగంలో.

ఎటొచ్చీ రాధాకృష్ణుని సూక్తి మౌక్తికం నాకు మౌలికంగా కదిల్పించి, ముగ్ధుణ్ణిచేసింది, నన్ను. తమ అమోఘకృషిలో వారు Social responsibilities ను గొప్పగా ఆదరించారని నాకు వారి మీద మక్కువ ఎక్కువ.

మరొకటి- 'We may not be able to change our circumstances, but we can always change our attitude to circumstances' పరిస్థితులను మనం మార్చలేకపోవచ్చునేమోగాని పరిస్థితులపట్ల మన మనోవైఖరిని మార్చుకునేశక్తి మనకెప్పుడూ వుంది. అన్నవారిసూక్తిమనజీవితయాత్రలో గొప్పగాఉపకరిస్తుంది

తప్పులో కాలేశాను. వెంటనే తీసేసుకొవాలి. ఎ
అందుకు మరో ప్రశ్న తెలుగులో అడిగాను: 'మీ ఆరోగ్యం
వుంది' అని. 'ఇలా ఉన్నాను' అన్నారు. నిసర్గరమణీయమైన
చిరునవ్వు నవ్వుతూ. 'చాలా అదృష్టం. మిమ్మల్ని కలుసుకో
టం' అంటూ భక్తితో నమస్కరించి. గదినుంచి బయ
వచ్చేశాను.

ఇక్కడ రెండు మాటలు చెప్పాలి. రాధాకృష్ణ పండి
వాడి చూపులూ, కొనదేరిన ముక్కూ నాకెంతో ప్రియమై
ఎంతో Purposeful గా వుంటుంది వారి తీరు బహుశా 196
కాలేజ్‌లు భవన్స్ జర్నల్లో ఒక ఆటోబయోగ్రాఫికల్ సె
(సంక్షిప్త స్వీయకథ) చూచాను. అందులో వారు ఇలా
కున్నారు. నన్ను అందరూ మహా సంయమశాలి అనీ,
మెరుగనివాడిననీ అనుకుంటారుకాని నాకూ ఆవేశకావేశాలు
అన్నారు. Nervously organised· capable of strong emo
అన్న మాటలు నాకు గుర్తు ఎవరి మనసైనా–దాని స్వభావ
చంచలమైనదే. దాన్ని దారిలో పెట్టడానికి తగిన విలువల
హన, వాటి ఆచరణలో శ్రద్ధ యివే మనిషిని మనీషిగా,
నీయుడుగా చేయగలవు. భగవంతుడు ప్రతి జీవుని
Individual commitment కలిగి వుంటాడని అంటారు డా॥
కృష్ణన్

# చలం - సౌరిస్‌లతో -1

"చలం మహర్షి అని ఎప్పుడో చెప్పేశాను." అన్నారు శ్రీశ్రీ. ఈ మాటలను అనడానికి శ్రీశ్రీకి ఎంతైనా క్వాలిఫికేషన్ వున్నది.

శ్రీశ్రీ కవిత్వంతో గుండెలమీది పెంకులు ఎగిరిపోతుంటే మీరింకా యిక్కడే వున్నారా' అని పేరడీ శాస్త్రి మెస్మరైజ్‌చేసే సిన్నాడు చలం విచలితుడై శబ్దవిరించి శ్రీశ్రీ స్వయానా మాటలతో సృజించిన మరో ప్రపంచాన్ని ఆత్రంగా కళ్ళతో తాగేశాడు కళ్ళద్వారాఅంతటి ఆవేశం హృదయంలోకి ప్రవహించడం తట్టుకోలేని చలం ఆ వరదలో కొట్టుకపోవడం మనకు తెలుసు. తెలీకుంటే శ్రీశ్రీకి చలం అక్షరాలా వ్రాసియిచ్చిన "యోగ్యతా పత్రం" చదివితే మనకు తెలుస్తుంది.

అప్పుడు శ్రీశ్రీ ఫిలాసఫీని వెనుకవేసుకరావడమే గాకుండా "పరవాలేదు పైకొస్తావని" శ్రీశ్రీని వెన్నుతట్టడానికి దగుల్బాజీ ప్రయత్నాలు చేసిన పెద్దలను గొప్పగా లెంపలువాయించేశారు చలం.

సత్యద్రష్టలు, క్రాంతదర్శనులు ఋషులుకదా, శ్రీశ్రీ అంటే ఏవిటో, ఎవరో, తొలిచూపులోనే తెలుసుకున్న ఋషి చలంగారిట్టి. చలం ఋషిత్వం శ్రీ శ్రీ కి తన విషయంలోనే దాఖలాగా దొరికింది.

సిద్ధాంతాల పెగ్గులు కవిత్వపు విగ్గులుగా మెరుస్తూకనిపించి తన మార్క్సిస్టు మెదుల్లాను ఖరాబుచెయ్యకుండా వున్నంతవరకూ వొట్టొట్టి సారస్వత సర్టిఫికేట్లు యివ్వడం మహాకవి శ్రీశ్రీకి సుతరామూ అలవాటులేదు; అలాటివి పుచ్చుకోవడంలో అసలు నమ్మకంలేదు. "పొగడ్డం నాకు చేతగాదు: మెచ్చుకోవడం మాత్రం చేతనవును" అన్నమాటలు ఒకసారి నాకు వ్రాశారు శ్రీశ్రీ.

శ్రీశ్రీ మెచ్చుకోలువల్లనే నాకు చలం మహర్షి అయినారు. ఆపైన, రవీంద్రుని గీతాంజలికి చలం వ్రాసిన 'ఇంట్రో' నన్ను దోచేసుకుంది. విలువునా. క్లిష్టమైన ఈశ్వరస్వరూప విరూపణాన్ని తన 'చలమీస్' లో (In the language of chalam) ఆయన ఎంతయినా చక్కగా, గొప్పగా ట్రీట్‌చేశారు. దాన్ని చదివిన తర్వాత ఆయన మానసికఋగ్గల్ని ముద్దాడుదామనిపించింది, అంటే అందులో అంత లోచూపు కన్పించింది, అతని మేధ లోతుల్లో ఋషిత్వమే దోబూచులాడింది.

రవీంద్ర కవీంద్రుడు తన గీతికల దోయిలితో సమర్పించిన జగదీశుణ్ణి చలం తన పీఠికా యవనికమీద బయోస్కోపిక్‌గా సాక్షాత్కరింపజేశారు భావుకులకు. సంచలనాత్మకంగావుంది ఆ చలం చిత్రం. దాన్ని చూచాక దాని నిర్మాత చలాన్ని చూడాలని పించింది. సౌరిస్‌ను చూడటంలో కూడా నాకు ఆసక్తి ఏర్పడింది యీమధ్య.

అందుకోసం తిరువణ్ణామలై – అరుణాచలేశ్వరుని క్షేత్రం- లోని రమణస్థాన్ చేరుకున్నాను ఉన్నగా. ఈ రమణస్థాన్ అన్నది ఏ పాకిస్తాన్ వంటి దేశమూ కాదుగదా కనీసం రెండెకరాల ప్రదేశమైనాకాదు. 10, లేక 15 అంకణాల కట్టుబడివున్న చిన్న మిద్దెయిల్లు. యెవరో ఆసామి అమ్మగా యీ యింటిని చలం కొనుక్కొని "రమణస్థాన్"గా నామకరణంచేసి, తన నివాసంగా మార్చుకున్నారు. రమణస్థాన్, రమణాశ్రమం రెండూ పక్కపక్కనే వున్నాయి.

ఇక నేను చూచిన చలం గురించి. చలానికి అప్పుడు 80 వదుస్తున్నది; ఆయన మాత్రం తాపీగా కుర్చీలో కూర్చుని, ఆదేమీ పట్టనట్లు కనిపించారు!

బంగారుఛాయలో-కాంతివంతమైన పెద్ద కళ్ళతో – దృష్టికి 'యితనే చలం' అనిపిస్తూ కనిపించిన విగ్రహానికి నేను చేతులు జోడించాను. వరండాలో ఆయన అలా కనిపించినప్పుడు అక్కడే

విల్చుని నాలుగు మాటలైనా మాట్లాడకుండా 'నేను నెల్లూరునుంచి వస్తున్నాను. సౌరిస్‌నుచూడాలి అన్నాను. ఎందుకో అప్పటికప్పుడే చలంతో మాట్లాడేందుకు రెడీగాలేవు ఆయన వాలకమూ, నా మనస్సూ. రెండూ.

హాల్లో చాపవేసుకుని కుర్చునివుంది చలంకూతురు సౌరిస్. ఆగంతకులతో మాట్లాడటానికి సిద్ధంగా వున్నట్లు కన్పించారామె. నేనేవో ప్రశ్నలు ఆమెను అడుగుతూ వుండగా చలం తన కుర్చీని వరండాలోనుంచి లోపలికి తెప్పించుకుని మాకు దగ్గరగా కూర్చున్నారు. మా మాటలు వినడానికి ఆయన కుర్చీలోంచి లేవడానికి, కూర్చోడానికీ కూడా. సాయం కావలసివచ్చింది.

శరీరంతోబాటు చలం మనస్సుకూడా కొంచెం ఎత్తుబడింది, ఇది ఎనభయ్యోపడిలో సహజమే.

చలంతో మాట్లాడటానికి నాందిగా వారి గీతాంజలి పీఠికను నేను ప్రశంసించాను. చలం రచనలు నేను ఎక్కువగా చదువలేదనీ కాని గీతాంజలి అనువాదానికి ఆయన వ్రాసిన పీఠికవల్లే ఆయన్ని చూడాలనిపించి వచ్చాననీ చెప్పాను.

ఒకప్పుడు మీరు ఫ్రీలవ్‌ను Advocate చేశారు. గదా. ఇప్పుడు మీరు యింతగా మారడానికి కారణమేమిటి? అన్నాను నేను. అందుకు బదులుగా ఆయన "నేనెప్పుడూ మారలేదు.

Free love నేనెప్పుడూ చెప్పలేదే. Free love ఏమిటి? లవ్వే ఫ్రీ" (Love is Free అని) అన్నారు.

ఇదేం ఖర్మరా బాబూ, అనిపించింది ఆ సమాధానం విని. చాలా క్షుణ్ణంగా తన గురించి చెప్పే కానని చలం భావించినా మనకు నిజమేదో తెలుసు, పైగా ఒకవైపు ఆయన ఆ మాటలు అంటుండగానే సౌరిస్ నాతో యిలా అన్నారు. "మేము Rebel's children గానే పెరిగాము. ఊరి చివరన ఏ పడిపోయ్యే కొంప లోనో వుండేవాళ్ళం. వూళ్ళోళ్ళయితే మాకు అద్దెకు యిచ్చేవారు కాదు." చలం మాటల్ని వెనువెంటనే contradict చేసినట్లు న్నాయి కదూ ఈ మాటలు! ముదిమి మదిలోకి ప్రవేశించింది మహామేధావి చలానికి.

'మీకు యీ మధ్యను ఏవో కొన్ని worries వున్నాయని విన్నాను, మీరు మీ చీకుచింతలను ఎలా అధిగమిస్తారు' అన్నాను.

"నాకు ఏ worries లేవు. నాకుండే వరీస్ మీకు తెలియవు మీరనుకునేటటువంటి వరీస్ నాకులేవు" అన్నారు జవాబుగా.

వెంటనే సౌరిస్ వ్యాఖ్యానం: నాన్నగారికి పెద్ద worries ఏమిలేవు చిన్న చిన్న worries గురించే పెద్దగా బాధపడతారు" అన్నది. "కరెంటు పోయిందనుకోండి, ఇక దాన్నిగురించే బాధ పడుతుంటారు

మునలితనంలో ఇది మామూలే. మానసిక శక్తులు నన్నగిల్లి వాళ్ళ మనసుకు Circular motion తప్ప linear motion వుండదు. ఒకే ఆలోచన మనసును maddening circles లో తిప్పుతూ, సవారీ చేస్తుంటుంది, కొందరికి.

"ఈ మధ్యనే ఆయన చివరి గ్రంథం స్వీయచరిత్ర పూర్తిచేశారు, నాన్నగారు. ఇప్పటికిదే చివరిది అనుకుంటున్నాం. ఇంకేదైనా వ్రాస్తారేమో తెలియదు." అన్నారు సౌరిస్, వ్రాతప్రతి పూర్తి అయిందట. చలం డిక్టేట్ చేయగా ఎవరో వ్రాశారట. మనసు మరికొంచెం పదనులో వున్నప్పుడు యీ పుస్తకాన్ని వ్రాస్తే బాగుండేది అనిపించింది నాకు.

ఒక జీవితకార్యం ముగిసింది. అది ఒక జీవితకావ్యంకూడా. అతడు మహర్షో! మహామేధావో యీ నాటి చలాన్ని 'చూచి' ఏ అచూకీ తీయడం ఎవరికీ వీలుపడదు.

ఎటొచ్చి చలం స్వీయ చరిత్ర ఆసక్తికరమైన పుస్తకమే అవుతుంది. అందుకోసం వేలాది ఆయన అభిమానులు ఎదురు చూస్తూ వున్నారుకూడా.

సౌరిస్‌తో నా భేటి మరోసారి!

# చలం, సౌరిస్‌లతో - 2

'నిన్ను నీవు తెలుసుకో' అన్న శ్రీ రమణమహర్షి సూక్తి చలం మేధకు బలమైన సవాలుగా తయారైంది. "హూ ఆర్ యూ" (నీవెవరు?) నీవు కేవలం శరీరానివా? మనస్సువా? బుద్ధివా? చిత్తానివా? అహంకారానివా? మరొకటా? బాప్రేబాప్! తల బద్దగట్టి పోతుంది. అయితే 'హూ ఆర్' ప్రశ్నల్లోకెల్లా ప్రశ్నగా తోచింది చలం మేధకు. దీన్ని దాటవేసుకొని పోవడం అంత సులువుకాదు చలం వంటి ఒక మేధావికి. అందుకే పీకదాకా మునిగిపోయాడు చలం యీ అద్వైతపుటడుసులో! మరింత గడుసువాళ్ళ కిలాటిదేదో వ్రాసిపెట్టి వుంటుందిలా వుంది పాపం!

ఆధ్యాత్మికంగా చలాన్ని దారిలో పెట్టాలని తొలిసారి ప్రయత్నించింది మాల పిచ్చమ్మగారు. చలం గుడివాడలో డి. ఐ. గా వుంటున్నప్పుడు కురుమద్దాలిలోవున్న పిచ్చమ్మగారి ఆశ్రమం ముందుగా క్యాంపులకు వెళ్ళేవారు చలం. పొత్తిళ్ళలోని పసిపాప వలె విలువెల్లా నగ్నంగా వుండేది పిచ్చమ్మగారు. ఆ మహాజ్ఞాని మాలకులంలో పుట్టడంవల్ల ఆమెకు మాల పిచ్చమ్మ అనేదే పేరైంది. ఆరోజుల్లో ఆమె నోరువిప్పి మాట్లాడేదికాదు. అంతా

సైగలు. సౌరిస్ తొందరగానే గమ్యాన్ని చేరుకోగలదనీ చలం చాలా తంటాలు పడవలసి వుంటుందనీ అందుకని త్వరలో 'మంచి దారి' లోకి రావాలని సైగచేసేదని సౌరిస్ చెప్పారు. 1937 నుంచి నాలుగేళ్ళపాటు యీమె సత్సాంగత్యం చలం సౌరిస్‌లకు దొరికింది. ఆ తర్వాత ఎక్కడివాళ్ళు అక్కడేవున్నా ఏ సంబంధమూలేకుండా పోయింది. ఇలావుండేది నాలుగేళ్ళే అనీ పిచ్చమ్మగారే ముందుగా చెప్పినట్లు సౌరిస్ నాతో అన్నారు.

మాల పిచ్చమ్మగారిని గురించి ఆమె యితర శిష్యులు చెప్పగాకూడా విన్నాను. ఆమె చెప్పింది చెప్పినట్లే జరిగేదట, చలం మహర్షిని పైతం పూర్తిగా విశ్వసించలేకపోయారట. చలం గమ్యం చేరుకోవడం కష్టమన్న ఆమె వాక్కు యిలా ఫలించిందేమో?

మరి సౌరిస్? సౌరిస్‌కు పసిపిల్లలవంటి నమ్మకాలు ఏర్పడ్డాయి! ఆమె ఆనందంగా వున్నారు.

సౌరిస్ భగవాన్ను చూడటానికి 1938 లో తొలిసారి వచ్చారు. చలంగారు వస్తూ పోతున్నా 1941-50 సం.ల మధ్య పదేళ్ళపాటు ఆమె తిరువణ్ణామలై రాలేదు. 1950 లో భగవాన్ శరీరాన్ని చాలించారు ఆ తర్వాత యిద్దరూ తిరువణ్ణామలైలో స్థిరపడిపోయారు.

సోదరి సౌరిన్ నమ్మకాలలో అతిమౌలికమైనది యీశ్వరావతరణం గురించినది. 1952 సం॥ ఆగస్టు 14 న రాత్రి ఒకవేళ శ్రీ రమణమహర్షి 'విషన్' లో కన్పించి నీకు రేపు ఈశ్వరుడు కన్పిస్తాడు, అని చెప్పి ఆశీర్వదించి వెళ్ళిపోతారు. మరునాడు అంటే ఆగస్టు 15 న సరిగ్గా అదేవేళకు సౌరిన్‌కు ఈశ్వరుడు కన్పించాడు. కన్పించి "నీకేం పరవాలేదమ్మా యిక మీదట నీతోనే ఉంటాను. మీ కుటుంబాన్నంతా నేనే ఆదుకుంటాను" అని అభయం యిచ్చి అదృశ్యం అవుతాడు. ఇదీ ఆమె చెప్పింది.

గాజు కొంపల్లో వుండేవాళ్ళు రాళ్ళకు వెరవక తప్పదు. సౌరిన్‌కు కల్గిన యీ అనుభూతికి బాగా ప్రచారం వచ్చింది. చలం కూడా వారం రోజులుపాటు సౌరిన్‌లోని యీశ్వరుడితో సౌరిన్‌నోటంట Space, time, causation గురించి చాలా ప్రశ్నలు వేసి తెలుసుకోవడం జరిగిందట ఇదిగాక పదిమంది పెద్దలూ, చలం స్నేహితులూ, 'యీ యీశ్వరావతరణాన్ని' గురించి తిరువణ్ణామలైలోచేరి గోష్టిచేసి అవుననీ, కాదనీ తలో మాటగా చెప్పారు. అక్కడ అవునన్న పెద్దలుకూడా తిరువణ్ణామలై వదలి వచ్చిన తర్వాత 'అబ్బే ఈశ్వరావతరణమూ, గట్రా ఏమీ లేదండీ' అని చప్పరించేశారట ఈ మాటలు నాకు సౌరిస్సే చెప్పారు, విర్విచారంగా.

సౌరిస్‌కు దర్శనమిచ్చిన యీశ్వరుని స్వరూపం గురించి నేను తరచి అడిగాను ఆమెను. నాలుగు మాటలు మీ చెవినకూడా వేస్తాను.

జీవుడు, జగత్తు, ఈశ్వరుడు అని మూడు తత్వాలు ఉన్నాయి వేదాంతంలో. సౌరిస్‌కు కన్పించింది జగత్ ప్రభువు అయిన యీశ్వరుడుకాదు. బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు అని పురాణాల్లో వర్ణించబడిన ఈశ్వరుడు కన్పించాదట. జటాజూటంలో చంద్రుడూ గంగా, నాగాభరణాలూ, యివన్నీ లేకుండానే ఒక వెలుగులావచ్చి దర్శనం యిచ్చేదట, అదే ఈశ్వరుడు.

చంద్రుణ్ణి శిరస్సున ధరించిన యీశ్వరుడొకడున్నాడని అతని నెత్తిన గంగ వుంటుందనీ నమ్ముతారన్నమాట అన్నాను. అవును నమ్ముతాను. పురాణాల్లో చెప్పినవన్నీనిజమే. ముప్పయి మూడుకోట్ల దేవతలూనిజమే, అన్నారు ఆవిడ. 'మరి మనవాళ్ల చంద్రుడి నెత్తినఎక్కి, దిగి వస్తున్నారుగా' అన్నాను. 'అదంతా వేరు. ఈ యీశ్వరుడు సత్యం' అన్నది ఆవిడ. నాలో కొంచెం ఆసక్తి మేలుకుంది. నేనూ వదల్లేదు. మార్కండేయ పురాణాం తర్గతమైన దుర్గాసప్తశతిలో "శేషశ్చ సర్వనాగేశో ధత్తేయః పృథివీమిమాం" అని వున్నది. అంటే సర్వనాగులకూ ప్రభువైన శేషుడు యీ భూమినంతా మోస్తున్నాడని- యిదీ నిజమేనంటారా?

అన్నాను. ఆహాఁ అన్నారు ఏసంశయమూ పెట్టుకోకుండా! Magnetic forces ప్రభావంవల్లగాక భూమి బహుశా బల్లబరుపుగా వుండి శేషుడి నెత్తిన మోపబడి వుంది. అతడు అనంతకాలం అలా చాదస్తంగా దాన్ని మోస్తునే వుంటాడు!

'ముప్పయిమూడుకోట్ల దేవతలన్నారు దివ్యత్వం K-Factor కాదుగా గీతలోనే చెప్పినట్లు 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' దేవతలు తాము చేసుకున్న పుణ్యం క్షయించగానే మర్త్యలోకానికి దూకేస్తారటకదా, అన్నాను. అలా కొందరి సంఖ్య తరుగుతూవుంటుంది ఇంకా మీకు దివ్యత్వంవచ్చి మీరే (సౌరిన్) దేవతల్లో కలిసిపోతే వారి సంఖ్య పెరగవచ్చు ఇలా దేవతల సంఖ్య Constant కాదుగదా అన్నాను. అదేంలేదు, ఆ సంఖ్య అలాగే వుంటుంది అన్నారు సౌరిన్.

వివేకానందస్వామి పురాణాలను వినోద కథలపుస్తకాలుగా ఆనందించవలసిందని చెప్పారు సైన్సు, టెక్నాలజీ ముందడుగు వేసేకొలదీ స్వామీజీ మాట అక్షరాల నిజమై కూర్చుంటున్నది. అయినా సోదరి సౌరిన్‌కు పురాణాల్లోని ప్రతి అక్షరమూ ఒక అక్షరసత్యంగా కన్పించడం నాకు విడ్డూరంగా కన్పించింది. పైగా ఆమె ఏ తర్కాన్నీ సాయం తీసుకోకుండా అది అంతే యిది యింతే అని చెప్పటంతో యీవిణ్ణి యిలా శ్రమపెట్టడం నాదే తప్పని అనిపించింది. మెల్లగా విషయంమార్చి నాలుగు మంచి

మాటలు మాట్లాడుకున్న తర్వాత ఆమె దగ్గర సెలవుతీసుకుని వచ్చేశాను.

కళావేదీ, తాత్త్వికుడూ అయిన శ్రీ సంజీవదేవ్‌ను ఒకసారి దేవీదేవతల సాక్షాత్కారాలు నిజమైనవా అని అడిగాను. 'వారు యివన్నీ Subjective Realities మాత్రమే! బాహిరమైన వాస్తవికత వాటికి లేదని అన్నారు సౌరిస్ మన సుకుబట్టిన అనుభూతి ఆమెవరకు నిజమైనదేకావచ్చు. కాని శాస్త్రరీత్యాగాని, ఆమె చెబుతున్న ఈశ్వరావతరణానికి వేదాంత ప్రతిపాదితమైన ఈశ్వరతత్త్వ సాక్షాత్కారంతో ఏమీ పొత్తు కుదరటంలేదు.

బహుశా తన అనుభూతిని సౌరిస్ సరిగ్గా బేరీజువేసుకునే స్థితిలో లేదు.

ఈశ్వరావతరణ దినోత్సవం అని ఆమె ఏటాజరిపే పండుగ వల్లనూ, యిది నలుగురి నోళ్ళలోపడి చర్చకు రావడంవల్లనూ నేనూ దీన్ని గురించి యింతగా వ్రాయవలసివచ్చింది. ఆనంద దాయకమైన ఆమె నమ్మకం ఆమెతో ఎప్పుడూ వుండాలని నేను యిప్పటికికూడా కోరుకుంటాను. అలాటి 'నమ్మకాలు' కొన్ని నాతో వుండటంమూలాన ఆమె నమ్మకాలనూ నేను సహజంగానే సమాదరిస్తాను. అయినా వాటికి ప్రామాణికత లేదని చెప్పడమే నా వుద్దేశ్యం.

—

# జిల్లెళ్ళమూడి అమ్మ

శ్రీరామనవమి వెళ్ళిన మర్నాడే జిల్లెళ్ళమూడి అమ్మ పుట్టినరోజు పండుగ.

ఈసారి యేభయ్యో జన్మతిథిని స్వర్ణోత్సవంగా జరుపుకుంటున్నారు భక్తులు. జన్మతిథినిబట్టి పండుగ చేసుకోవడం మన సంప్రదాయంలోనూ వున్నదే. కాని పాతికేళ్ళకు రజతోత్సవం, యాభైయేళ్ళకు స్వర్ణోత్సవం అని సంబరాలు చేసుకోవడం బహూశా విదేశీ సంప్రదాయం, 'మన' షష్టిపూర్తిదాకా ఆగడం దేనికని లోకరీతిగా సాగిపోతున్నారు జిల్లెళ్ళమూడి శ్రీ విశ్వజననీ పరిషత్ మిత్రులు.

అమ్మకు పుట్టినరోజు పండుగవలెనే పెళ్ళిరోజు పండుగ కూడా జరుపుకుంటారు. ఏటా

మిగతా వేడుకల సంగతి చెప్పనక్కరలేదు. భోగినాడు వచ్చే భక్తులందరకీ అమ్మ భోగిపండ్లు పోస్తుంది. యీ వేడుక ఒక్కోసారి సంక్రాంతినాడుకూడా వుంటుంది. నాకూ ఒకసారి సంక్రాంతి రోజు భోగిపండ్లు పోసింది అమ్మ.

మహార్నవమికి వేడుకలుంటాయి. అమ్మ పాదాలకు బంగారుచుట్లూ పిల్లెళ్ళూ పెట్టి విలువైన చీరలతో నగలతో అలంకరించడమేగాక బంగారుపూత పూసిన వెండి కిరీటాన్ని పెడతారు. త్రిశూలం చేతికిస్తారు. బరువైన మాలలు వేస్తారు.

సజీవమూర్తి అయిన అమ్మ యీ తంటాళ్ళన్నిటినీ శిలామూర్తులవలెనే భరించడానికి వొప్పుకుంటుంది. ఒక్కోసారి దర్శనానికి కూర్చుంటే 10, 12 గంటలు అట్టే గడిచిపోతాయి.

నామట్టుకు నేను యీ ఉత్సవాలూ సంబరాలూ మనలను సంతోషపెట్టినంతగా ఆమెను సంతోషపెట్టలేవని అనుకుంటాను.

పూజ్యశ్రీ కైలాసానందస్వామీజీ (విశ్వవిఖ్యాత రామకృష్ణమిషన్ కోశాధికారి) ఒకసారి నాతో యిలా అన్నారు: "నర్సింగ్, యీ మఠం మిథ్య, యీ ఉత్సవాలు మిథ్య; యీ ... మిథ్య; శ్రీ గురుమహారాజ్ (రామకృష్ణుడు) ఒక్కడే సత్యం" అని.

ఏమిటిరా భగవంతుడా, అంతా మిథ్యే నంటారు, యీయన ఈ మాటలూ మిథ్యేనా? అనిపించింది అప్పుడు. కాని ఆమాటల వెనకాల ఒక గొప్ప వేదాంత రహస్యం దాగివుందని తర్వాత తెలుసు కున్నాను.

బెంగాలీకవి కమలాకాంతుడు ఇలా అన్నాడు: "మార్కెట్ దగ్గరనిలుచుని ఈ వేదాంతరహస్యాన్ని ఎలా బయటపెట్టగలనూ?

ఎవరిని బ్రహ్మమని వేదాంతులు అంటున్నారో వారినే నేను 'అమ్మ' అంటున్నాను....అని అయిష్టంగానే అసలు నిజం కక్కేశాడాయన!

పారమార్థిక దృష్టిలో బ్రహ్మమయి అయిన 'అమ్మ' ఒక్కటే సత్యం, జిల్లెళ్ళమూడిలో. మిగతది అంతా మీకూనాకూ అవసరంగనుక నడుస్తున్నది. నిజానికి అది పూజాగాదు వుపాసనా కాదు; ఒట్టి లోకాచారంవలె కన్పిస్తుంది నా కళ్ళకు.

ఈ ఉత్సవాలపట్లనూ పూజలపట్లనూ అమ్మవైఖరి ఆశ్చర్యకరంగా వుంటుంది.

ఎప్పుడుగానీ అమ్మ 'పూజచెయ్యండి' అనదు. ఎవరైనా భక్తులు కోరినపుడు 'పూజ చేసుకోండి", "చేసుకోవచ్చు" అంటుంది.

పూజకు ఏ పూలు తెచ్చారో తన పాదాలను యే విధంగా పూజిస్తున్నారో – సమంత్రకంగానో – అమంత్రకంగానో - ఆమె పట్టించుకోదు. ఎవరో పెదకట్టె రామలింగడు ఒకసారి నాగజెముడు మట్టలుతెచ్చి— అవీ దళమైన ఆకులేకదా అని – దూరం నుంచి అమ్మ పాదాలమీద వేస్తూ పూజచేశాడట. కాలు కదలించకుండా పూజ జరుగనిచ్చిందట అమ్మ. ఈ మాట నేను జిల్లెళ్ళమూడిలోనే విన్నాను.

ఒకసారి అమ్మ బందరులో ఒకరింటికి పెళ్ళికి వెళ్ళిందట. విడిది యింట్లో యీమెబస అందరూ పెళ్ళింటికి భోజనానికి వెళ్ళారు. అమ్మకు చిన్నప్పటి నుంచీ భోజనంచేసే పేచీలేదు గనుక తీరికగా వున్నందువల్ల చీపురుతీసుకొని గది చిమ్మడం మొదలుపెట్టింది. ఎక్కడ వున్నదో పెద్దమండ్రగబ్బ అమ్మను కుట్టింది. ఆమె శరీరం అపరంజి రంగులో తళతళలాడుతుంటుంది నాటికీ నేటికి. విషందెబ్బకు పాదమంతా నల్లబడిపోయింది. తర్వాత కాలంతా నల్లగామారింది విషం పైకెక్కడంవల్ల. అమ్మ ఎప్పుడుగానీ ఏడవదు చీపురుకట్ట పక్కనపడేసి కూర్చుని వుంది. కసవు అలాగే నిలిచిపోయింది గదిలో. భోజనాలుచేసి జనం తిరిగి వచ్చారు. ఎవరో అడిగినమీదట మండ్రగబ్బగాని తేలుగాని కుట్టి వుండవచ్చునని అన్నదట. ఏమిటా అని గది అంతా గాలించారు. కణికెడు మండ్రగబ్బ....నల్లగా....ఒకచోట నక్కి వుందట. అమ్మ వద్దంటున్నా అక్కడ చేరినవాళ్ళు దాన్ని చంపేశారు. పాము మంత్రాలూ, తేలు మంత్రాలూ, వేపమండలూ ఏవీ అమ్మమీద పనిచెయ్యవు నానా ఆయాసపడి మంత్రించిన బంధువు ఒకాయన ఎలావుందని అడిగాడట "నాకేమి తేడా కనిపించటంలేదు; యిక మీకోసం ఏదైనా చెప్పాల్సిందే" అన్నదట కొన్ని నెలల తర్వాతకాలో ఆ నలుపురంగు విరిగిపోయింది. అమ్మ అవిర్వికణ్ణ చేతస్కత, గంభీరత అలాంటిది. యీ మాటలు ఎవరో చెప్పినవి కావు అమ్మ చెబుతుండగా నేను చెవులారా విన్నవి.

అలాగే 1968 లో కాబోలు, "పదార్చన" అనే కవితా సంకలనం వేశారు జిల్లెళ్ళమూడి మాతృశ్రీ గ్రంథమండలి తరపున. అందులోని "పున్నాగపూలు" నేను వ్రాశాను. అమ్మ పుట్టినరోజు పండుగనాడు అమ్మ చేతనే ఆవిష్కరణోత్సవం అని ఆహ్వానం వచ్చింది నాకుగూడా. వెళ్ళాను. అంతకు మూడు నాలుగురోజులకు ముందుగానే అమ్మ కుమార్తె సోదరి హైమ మరణించింది. ఈ దుర్వార్త బాపట్ల (జిల్లెళ్ళమూడికి 7 మైళ్ళు) చేరిన తర్వాతగాని తెలియలేదునాకు. కడుపుకాలి ఆ తల్లి పుట్టెడు దుఃఖంలో మునిగివుంటే ఆవిష్కరణోత్సవం ప్రస్తావన ఎలా వస్తుంది? మనిషైనవాడు ఎలా తెస్తాడు? అనుకున్నాం.

అనుకున్న సమయానికి అమ్మే చెప్పిందట. దేనిపాటికి అదే, ఏదీ ఆగడానికి వీల్లేదు. జరుగనీయండి అన్నదట. వేద మాతలాటి అమ్మ నల్లచీర కట్టుకుని వేదికమీదకు వచ్చి కూర్చుని శాంతచిత్తతతో ఆవిష్కరోణోత్సవం జరిపినతీరు మరువరానిది. పైగా ఒక్కొక్కరికీ స్వహస్తాలతో కుంకుమబొట్టు తీర్చి, పుస్తకం చేతికిచ్చి ఆశీర్వదించింది, ఆనాడు.

నాటి ఆమె మనోనిగ్రహం నాకు పిచ్చెక్కించింది!

ఎంతో మనోనిగ్రహం? ఎంత అనిర్విణ్ణత?.... ఈమె మానవియేనా? అన్న సంశయం వచ్చింది అందరికీ.

అమ్మ ఒక్క కన్నీటిబొట్టయినా రాల్చకపోవడం చూచి 'అమ్మా మీకు కన్నీళ్ళేరావా' అన్నారట ఎవరో! 'కన్నీళ్ళే ఏడుపుకాదుగా'' అందట అమ్మ, తన బాధను వ్యక్తంచేస్తూ.

అమ్మ కన్నీళ్ళు శాశ్వతంగా ఆమె కనుగొలకుల అవతలే నిలిచిపోయినాయి; నిజమే, కాని తన గారాలబిడ్డ దేవతగా వెలసి తన కళ్ళఎదుటే పూజలందుకున్నదికూడా నిజమే. హైమ శశ్వత్కీర్తి నేడు హైమాలయంలో దీపంగా వెలుగుతూవున్నది, 'అమ్మ' ప్రేమ మానవత్వాన్ని దివ్యత్వంతో నింపుతుందన్న సత్యానికి చక్కని రూపకల్పన వంటిది యీ జిల్లెళ్ళమూడి హైమాలయం!

అన్నదానం అమ్మకు అత్యంత ప్రీతిపాత్రమైనది. వంద లాది భక్తులు-కుల, మత, వర్ణవర్గ పరమైన ఏ భేదమూలేకుండా రోజూ ఒకేబంతిన భోజనం చేస్తారు అక్కడ. ఉత్సవ సమయా లలో వేనకువేలు జనం వస్తారు. ఈ సారికి లక్షమంది ఒకేసారి భోజనానికి కూర్చుంటారని అంచనా అట. ఉప్పుగోంగూర అన్న మైనాసరే వచ్చినవాళ్ళకు ప్రియంగా అన్నం పెట్టడం జిల్లెళ్ళ మూడి క్షేత్రంలోని విశేషం. నిత్యాన్నదాననిరత అమ్మ.

సమాజంలో మనం గీసుకున్న గిరులను చెరిపేసి. ఒకే వలయం మధ్యను మనల్ని మనషులుగా నిలిపేందుకు అమ్మ

చేస్తున్న అజ్ఞాతకృషిలో ఆమె అంగీకరించిన యీ ఉత్సవాలూ ఒక భాగమేమో?

అమ్మ ప్రభావం అమోఘమైనది; 'ఇక్కడకు వచ్చిన వాళ్ళెవ్వరూ వూరికే పోరురా' అంటుందట, ఆమె. అమ్మ సందర్శనమేగాక పదసంస్పర్శన, సంభాషణలుకూడా లభించాయినాకు.

అందుకే ఆమెను బ్రహ్మమయిగా సంభావించే భాగ్యం నాకు కల్గింది.

# లోచూపుగల మనీషి శ్రీ అక్కినేని

ఆ రోజు మార్చి 6, 1973. ప్రొద్దున తొమ్మిది గంట లయింది. శ్రీ రామకృష్ణ పరమహంస జన్మోత్సవం మైలాపూరు శ్రీ రామకృష్ణ మఠంలో వైభవంగా జరుగుతూ వుండాలి అది



పూజా సమయం. పాలరాళ్ళు పరచిన ఆ సుందర భగవన్మంది రమూ, విశాలమైన ప్రాంగణమూ ఎప్పుడో నిండిపోయివుండాలి.

ఆలోచనలకు పీఠంలేదు, నిజమే. మనస్సు మందిరం దగ్గర తారాడుతూవుంది. నేను మద్రాసు సెయింట్‌థామస్‌మౌంట్ దగ్గర వున్నాను.

కార్యాంతరంవల్ల చెంగల్పట్టుకుపోయి వున్న నేను ఆరోజు శ్రీ నాగేశ్వరరావును సకాలంలో కలుసుకోడానికి ఆతురతపడుతూ మద్రాసు సెయింట్‌థామస్‌మౌంట్ స్టేషన్‌లో ఎలక్ట్రిక్ ట్రెయిన్ దిగి హుటాహుటిగా మౌంట్ సోపానాలదగ్గరకు వచ్చి నిలుచున్నాను.

హోటల్ సవేరాలో కలుసుకుని మీతో యింటర్వ్యూ కావాలని నేను కోరినప్పుడు మార్చి 5, 6 తేదీల్లో శివాజీగార్డెన్స్‌లో షూటింగ్ వుంది. అక్కడ యింటర్వ్యూ చెయ్యవచ్చు అన్నారు శ్రీ అక్కినేని.

'5 న రాలేకపోయాను. ఆరవ తేదీ ఎలాగైనా వారిని చూడాలి' అనిపించింది. సిటీబస్ అందుకుని మౌంటుకు 5, 6 మైళ్ళలోవున్న శివాజీగార్డెన్స్ (శివాజీగణేశన్‌తోట) చేరుకున్నాను. శ్రీ అక్కినేనితో గంటకుపైగా మాట్లాడే అదృష్టం లభించింది ఆనాడు.

శ్రీ నాగేశ్వరరావు తెలుగు ఫిలింఫీల్డులోని Most sensible and most sensitive star. అందుకే వారంటే నాకు ప్రత్యేక

మైన అభిమానం. నిజానికి నా మనసులోని మాట వారితో అన్నాను. నటుడుగా ఆయన యశస్సు అభ్రంకషశృంగాల్లో విహరించడం జగమెరిగిన సత్యమే కనుక నేను ఆ విషయం ప్రస్తావించ దలచుకోలేదు.

ఈ భేటీలో ఒక విశిష్టతకూడా వుంది. వారి జవాబులను కొన్నింటిని లిఖితపూర్వకంగా నాకు అందించడం, నా ప్రశ్నలతో బాటు అక్కినేని జవాబులనూ నేరుగా మీకు జారీ చేస్తున్నాను.

నేను : జీవితంలో ఆశావాదం విజయానికీ, నిరాశావాదం ఓటమికీ దుఃఖానికీ దారితీస్తుందని అంటారు. మీ అనుభవం ఎలా వుంది?

శ్రీ అక్కినేని : నిరాశావాదం ఓటమికీ దుఃఖానికీ దారితీసే మాట నిజం. ఆశావాదమూ, ఆవాదంతో సాధించిన విజయాలూ దృష్టిలో వుంచుకునే యీ అభిప్రాయాన్ని చెబుతున్నాను ఇక నిరాశావాదం అంటారా ! నాకు అనుభవమూ లేదు, అందులో నమ్మకమూలేదు.

నేను : మిమ్మల్ని పర్సనల్‌గా విమర్శించే వారిపట్ల మీ మనో వైఖరి ఏమిటి?

శ్రీ అక్కినేని : విమర్శ అంటే నాకు చాలా గౌరవం. విమర్శ నా జీవితంలో గురువు లాటిది. అయితే, విమర్శించేవారి

విజాయితీ సంస్కారం, సునిశితబుద్ధి మొదలైన విషయాలపైన ఆ విమర్శను బేరీజువేసుకోవడం జరుగుతుంది.

నేను : మీకు చూపవలసిన కృతజ్ఞత చూపనివారిపట్ల మీ మనోవైఖరి ఏమిటి?

శ్రీ అక్కినేని: అసలు కృతజ్ఞతాభావం ఎదుటివారి నుంచి ఎదురు చూడడం స్వార్థం అవుతుంది. ఎవరైనా కృతజ్ఞత చూపిస్తే అది వారి మంచితనం అవుతుంది. యిచ్చిపుచ్చుకోవడం అవుతుంది. కేవలం యివ్వడంలోనే వున్న ఆనందం అందరికీ అర్థం అవుతుందా?

నేను : Milk sops నూ, mushroom personalities నూ మీరు అసహ్యించుకుంటారుగదా. బ్రతుకుబాటలో Strong man గా వుండటానికి తరచూ మీరేమాటలు గుర్తుంచుకుంటారు?

శ్రీ అక్కినేని : మంచితనం మనకోసమనీ, సమర్థత యితరుల కోసమనీ అనుకునే వ్యక్తిని నేను. మనలోని ఏ కళ గానీ, ఇతరులు Enjoy చేయాలనుకోవాలి. సమర్థత అనేది Cultivated thing అది యితరుల కోసంగా మనం పెంపొందించు కోవలసివుంది. మనలోని మంచితనమనే వస్తువును యితరుల కంటె మనమే ఎక్కువ ఆనందిస్తాం సామర్థ్యం ఒక వస్తువు అనుకుంటే దాన్ని మనకంటే యితరులు ఎక్కువ ఆనందిస్తారు.

జీవితంలో యితరులను ఆనందింప జేయడమే ప్రధానమైన విష యంగా భావించిన రోజున సామర్థ్యాన్ని అభివృద్ధి చేసుకోడానికీ తద్వారా మిగతావాళ్ళకు ఎక్కువ ఆనందం కల్గ చెయ్యడానికీ మానవుడు ఎక్కువ కృషిచేస్తాడు. ఆ కృషిలో మనిషి Strong man అవుతాడు.

నేను: జీవితంలో మీ విజయానికి కారణభూతమని చెప్ప కోదగిన Mental attitudes ఏవి? Working habits కొన్ని చెప్పగలరా?

శ్రీ అక్కినేని: ముందు విజయాన్ని సాధించాలంటే ఆ విజయం విషయంలో పవిత్రత కావాలి. నిజాయితీ కావాలి. అది న్యాయమైన కోర్కెగా వుండాలి ఇక ఆ విజయ సాధనలో మనస్సు శుద్ధిగా వుండాలి యోచించడానికి సునిశితబుద్ధి కావాలి, సిద్ధి (పట్టుదలకు యీ మాటను వాడుతారు అక్కినేని) కావాలి. అలా నేను జీవితంలోనూ, నా వృత్తిలోనూ 82% విజయాన్ని పొందాను. నా చిత్రాల విజయాలు అలానేవున్నాయి.

షూటింగ్‌లో పాల్గొంటూనే, మూడ్‌నూ అట్టే పెట్టుకుని అవలీలగా అలవోకగా తన వైయుక్తికజీవన విధానాన్ని గురించి నా ప్రశ్నలకు అక్కినేని అక్షరాలా వ్రాసియిచ్చిన జవాబులు నన్ను

ఆశ్చర్యచకితుడిని చేశాయి. అందమూ, పొందికా, లోచూపూ అన్నీవున్న అక్కినేని వాక్యాలు రసాత్మకాలైన కావ్యాలవలె వున్నాయి నాకు. మీరు ఆయన అభిమానులైతే అక్కినేనిలా జీవితయాత్రలో విజయాన్ని సాధించడానికి వీటిని పాథేయంగా వాడుకోవచ్చు.

# శ్రీ రామారావు నటరత్న మాత్రమేకాదు

1973 మార్చి ఒకటో తేదీ పొద్దున సరిగ్గా ఏడింటికి త్యాగరాయనగర్ బజుల్లారోడ్డులోని నటరత్న స్వగృహంలో నేను వారిని యింటర్వ్యూ చేశాను. ఆ ముందురోజు మధ్యాహ్నం ఒకటిన్నరకు స్టూడియో నుంచి వచ్చాక భోజనంచేసిన వెంటనే



తన్ను చూడవచ్చిన వారిని చూడవచ్చారు వరండాలోకి నా కోరిక మేరకు మర్నాడు ప్రొద్దునే నాతో ప్రత్యేకంగా మాట్లాడటానికి అంగీకరించారు.

శ్రీ ఎన్టిఆర్ ఎంతో క్రమబద్ధమైన దినచర్య పాటిస్తారని విన్నాను. నేను ఏడింటికి వెళ్ళేసరికే వరండాలో కూర్చుని

వున్నారు. నేను చేతులు జోడిస్తూనే వారు ప్రతినమస్కారంచేసి సోఫా చూపించారు.



మనస్సుకు శాంతిని సాధించిపెట్టడంలో తాను అనుసరించే విధానాలేమిటో తెలుసుకొనవచ్చానని ముందురోజు వారికిచ్చిన చీటీలో వ్రాసియిచ్చాను. అందువల్లే, మర్నాటి మా సంభాషణ రన్‌వేతో పనిలేకుండా నేరుగా టేక్‌ఆఫ్ చేసే విమానంలా విషయంలోకి దూసుకుంది.

'తృప్తి. తృప్తి' యీ రెండక్షరాల మాటను మాత్రంచెబుతాను. తృప్తి అనే చిన్నమాటను రెట్టిస్తూ ఎన్టీఆర్ పలికిన తీరు నాకెంతో ఆహ్లాదాన్ని కల్గించింది. మనిషి ఉన్నదాంతో సంతోషపడటం చాలాముఖ్యమని ఆయన అన్నారు. 'నేను కాటన్‌చొక్కావేసుకుని వున్నాను. మీరు టెర్లిన్‌వేసుకున్నారు. నాకున్న కాటన్ చొక్కాతో తృప్తి పడకుండా నాకూ టెర్లిన్ చొక్కాలేదే అని బాధపడుతుండే యిక మనస్సుకు శాంతి ఎలా లభిస్తుంది? అసలు చొక్కాయే లేనివాళ్ళుండగా, వున్న చొక్కాతో తృప్తి పడటం నేర్చుకోవద్దా?' ఇలా అంటున్నప్పుడు వ్రేలితో నా చొక్కావైపు చూపించారుకూడా. ఇందులో ఓ చిన్న డ్రమటిక్ ఐరనీ వుంది. అప్పుడు నిజంగానేవారు కాటన్ చొక్కా, నేను టెరికాటన్‌చొక్కా వేసుకుని వున్నాం!

మరో ప్రశ్న. బ్రతుకుదారిలో ముందుకు నడవడం ఎలా అన్నది. Giving a meaning to life is proressing in life

అన్నారు తడుముకోకుండా. మనం ఎందుకు బ్రతుకుతున్నామో అంటే ఒకరి బ్రతుక్కి ప్రయోజనం ఏమిటో తెలుసుకుంటే అతడు తప్పనిసరిగా జీవితంలో ముందడుగు వేస్తాడన్నారు ఒకరు నటుడు ఎందుకయినాడో అంటే ఏ ప్రయోజనాన్ని సాధించడానికి తాను నటుడైనాడో తెలుసుకుంటే అతడు తన దారిలో ముందుకు పోగలడు. అలాగే ఒక విద్యార్థి! ఏ ప్రయోజనాన్ని సాధించడానికి తాను విద్యార్థి అయినాడో ఎరుకపరచుకుంటే తాను విద్యార్జన లోని లోతులకుపోయే అవకాశం వుంటుంది. ఒక్కొక్క మెట్టు దాటుకుంటూ ఆ విద్యార్థి పైకి వెళ్ళగలడు. ప్రతివాడూ తన బ్రతుకొక్క ప్రయోజనం కల్పించుకుని అర్థవంతంగా బ్రతకడం నేర్చుకుంటే బ్రతుకుబాటలో ముందడుగు వెయ్యడం దానంతట అదే జరుగుతుంది" దీన్నే డా॥ రాధాకృష్ణన్ Purposful living అంటారు.

తన 25 ఏళ్ళ నట జీవితంలో ఎప్పుడుగానీ ఒక్క కాల్ షీట్ కూడా మిస్ కాలేదనీ, మనిషి తలుచుకుంటే అసాధ్యమనేది ఏదీ లేదనీ అన్నారు.

అయితే Super Power అనేది ఒకటుందని అంటారు ఎన్. టి. ఆర్. లేకుంటే కేవలం ప్రయత్నంచేతనే ప్రతివాడూ యీ దేశానికి ప్రధానమంత్రి ఎందుకుకాలేడు? ఒక్కొక్కడు అందుకో గల ఎత్తు ఒక్కొక్క విధంగా వుంటుంది. కాని చొరవచేసుకుని మనం యితంకు ముందు చెయ్యనిదేదో ఒక ప్రయోగంచేసి సాధించ

డానికి ప్రయత్నించాలి. అప్పుడే జీవితంలో ముందడుగు సాధ్య పడుతుంది.

బహుశా నటరత్న ప్రయోజనాత్మకంగానూ ప్రయోగాత్మకంగానూ తీసిన చిత్రాలు యీ మాటలన్నప్పుడు ఆయన దృష్టిలో వుండవచ్చు

తన అవిర్విణ్ణతనూ, నిస్సంగత్వాన్నీ చెబుతూ, 'పెద్దబ్బాయి (రామకృష్ణ) పోయి యింటిల్లిపాది ఏడుస్తున్నప్పుడు కూడా నేను కంటతడి పెట్టలేదు. మన చేతనైనంత చేశాక ఫలితాన్ని దైవానికి వదలిపెట్టవలసిందే'' అన్నారు.

శ్రీ ఎన్టీఆర్ ఈమాటలు అంటున్నప్పుడు ''కర్మణ్యేవాధికారస్తే, మాఫలేషుకదాచన ' స్వధర్మాను సారంగా లభ్యమైన కర్మను నిర్వర్తించడానికే నీకు అధికారం, కర్మఫలంమీద నీకెన్నటికీ అధికారం లేదన్న గీతా శ్లోకం గుర్తుకొచ్చింది నాకు. తస్మాదపరిహార్యేర్థేనత్వంశోచితుమర్హసి Why weep over an inevitable situation ? డేల్ కార్నెజీ కూడా Cooperate with the inevitable అంటారు. రామారావుగారన్న మాట ఎంతో తత్త్వ దృష్టితో కూడుకున్నది. మాటల సందర్భంలో యీ మాటకూడా అన్నారు, "I am a Philosopher in my own right''

ఇంతలో 'బడిపంతులు' ప్రొడ్యూసర్ కాబోలువచ్చి బడి పంతులులో పాత్రపోషణ గురించి వారిని అభినందించడమూ,

మేకప్ మేన్ మేకప్ చేయడానికి రావడమూ జరిగాయి. నేను సెలవు తీసుకుని వచ్చేశాను.

15 నిముషాల యీ చిన్న భేటీ నన్నెంతో ఆలోచింపచేసింది.

నేను ఎన్టీఆర్‌ను తొలిసారి చూచింది మిడిమిడికాలే విజయవాడ ఎండల్లో ఆసురుసురవుతూ అంగడి అంగడికీ తిరుగుతూ జి. వరలక్ష్మితో చెయ్యీ చెయ్యీకలిపి రాయలసీమ క్షామబాధితుల కోసం జోలెపట్టి నిధి వసూలుచేస్తున్నప్పుడు. ఆయన యితరుల ఆర్తిగురించీ, ఆవేదనగురించీ, ఎంతగా ఆలోచిస్తారో, శ్రమిస్తారో నేను కళ్ళారా చూచాను. ఇతరుల కన్నీళ్ళకోసం తను కన్నీరు కారుస్తూ చేతులు ముడుచుకుని మూలన కూర్చునే స్వాప్నిక భావవాది కాదాయన. ఎర్రటి ఎండలో తొక్కిసలాడే బజారులో ఒక పరిష్కృతి కోసం ఎగబడి గాలించి, దాన్ని తన పిడికిట్లోకి తీసుకునే సాహసి.

ఒడ్డులోరసే నిండుదనానికీ, చుక్కలంటే ఔన్నత్యానికీ వూపిరిపోసే పౌరాణిక ఐతిహాసిక పాత్రలు శ్రీ రామారావుకు 'సొంత సొత్తు'. శిష్టపాత్ర పోషణ కళాప్రపూర్ణుడైన మన రామారావే అశేషాంధ్ర జనావళికి రాముడూ కృష్ణుడూ, శ్రీనివాసుడూ రావణుడూ, దుర్యోధనుడూ, అర్జునుడూ, భీముడూకూడా. వైవిధ్యమేగాక స్వాభావిక వైరుధ్యమూకల్గిన విభిన్న పాత్రలలో శోభించడం నటరత్నకు నల్లేరుపై బండినడక. ఆయన కనుముక్కుతీరూ, ముఖవర్చస్సూ మేనిబంగారుఛాయా యీపాత్రలకు బంగారానికి వెలిగారంలా అతికిపోతాయి.

—/o/—